టిబెట్టులో కొద్దిమంది దేశద్రోహులు లేవదీసిన తిరుగుబాటు చాలావరకూ అణచివేయబడింది. విద్రోహులు అతిహీనంగా ఓడించబడటంతో టిబెట్టులోని అత్యధిక భూభాగంలో ఈ సంఘర్షణ అంతమైంది. ఇప్పుడు టిబెట్టు శాంతియుత విప్లవంలో ప్రవేశిస్తోంది; అంటే, జాతీయ ప్రజాకాంగ్రెసు (నేషనల్ పీపుల్సు కాంగ్రెసు తీర్మానంలో పేర్కొనబడ్డ ప్రజాతంత్ర సంస్కరణలు) టిబెట్టులోని విస్తృత ప్రజాబాహుళ్యం చాలాకాలంగా ఆశిస్తూ అత్యవసరంగా నెరవేర్చబడవలసిన ప్రజాతంత్ర సంస్కరణలు అమలు జరపవలసిన కర్తవ్యాన్ని ఎదుర్కొంటున్నది. ఇదొక విప్లవం: 1949 ప్రాంతంలో, చైనా ప్రధాన భూభాగంలో మహోద్యమంగా పెల్లుబికిన ప్రజావిప్లవం టిబెట్టులో కొనసాగటమే ఈ విప్లవం. వెనుకటి టిబెట్టు స్థానికప్రభుత్వం అడ్డుపడటం మూలకంగా టిబెట్టు శాంతియుత విమోచనం తదాది ఈ 8 సంవత్సరాలూ టిబెట్టులో ఈ విప్లవం కొనసాగలేదు. ఈ తిరుగుబాటు అణచివేయబడ్డ వెనువెంటనే సాగేవిప్లవం శాంతియుతమైనదిగా, అంటే, రక్తపాత రహితమైనదిగా వుంటుంది. హాన్‌జాతి ప్రాంతాలలో జాతీయ బూర్జువావర్గంయెడ ఎటువంటిపంథా అవలంబింపబడిందో దాదాపు అటువంటి సమాధాన పూర్వక పంథానే టిబెట్టు ప్రజలుకూడా ఈ తిరుగుబాటులో పాల్గొనని టిబెట్టు ఉన్నతవర్గాలయెడ అవలంబిస్తారు. ఇప్పటికే ప్రజాతంత్ర సంస్కరణలనూ, సోషలిస్టు పరివర్తనమూ పూర్తిజేసిన కోటానుకోట్ల చైనా ప్రజల పూర్తి అండదండలు వుంటాయి గనుక టిబెట్టుప్రజలు ఈ కర్తవ్యాలను నెరవేర్చటానికి తగిన అనుకూల పరిస్థితులు ఏర్పడే వున్నాయి.

ప్రస్తుతం ప్రపంచంలోని అనేక దేశాలలో ప్రజలు టిబెట్టు సమస్యను గురించి మాట్లాడుచున్నారు. ఇది చాలా మంచివిషయం, ప్రపంచానికి నడికప్పుగా వ్యవహరింపబడే ఉన్నత పీఠభూమిలో నివసిస్తూ, ఎవ్వరూ, ఎన్నడూ అంతగా పట్టించుకోకుండా మరుగునపడివున్న 10 లక్షలకు మించివున్న టిబెట్టు ప్రజలు మొత్తం ప్రపంచ ప్రజలందరియొక్క దృష్టిని ఆకర్షించే గౌరవాన్ని పొందటానికీ, ఈ విశ్వ వ్యాపితచర్చలలో జ్ఞానోదయం పొందటానికీ, స్థితప్రజ్ఞను సంపాదించటానికీ ఈ విధంగా అవకాశం కల్గుతోంది. టిబెట్టులోని

కొలదిమంది అభివృద్ధి నిరోధకులు బయలుదేరదీసిన ఈ తిరుగుబాటును కొందరు విదేశీయులు "విప్లవం" అనీ, "జాతీయ," "దురాక్రమణ వ్యతిరేక," "వలస రాజ్యాంగ వ్యతిరేక," "సామ్రాజ్యవాద వ్యతిరేక," "విప్లవము" అనీ ఈ తిరుగుబాటుదారులు "పూర్తి," అవిచ్ఛిన్నమైన," "స్వపరిపాలనకూ," లేక "స్వాతంత్రానికీ" అర్హులనీ చెప్పుచున్నారు. మరొకవైపు వీరే, టిబెట్టు ప్రజల సంపూర్ణమైన తోడ్పాటుతో ప్రజావిమోచన సైన్యం ఈ తిరుగుబాటును అణచి వేస్తే దానిని "సాయుధ దురాక్రమణ" అనీ, "దండెత్తటం" అనీ, "హిట్లరు చర్య" అనీ వర్ణిస్తున్నారు. ఈ విధంగా మాట్లాడేవారిలో పశ్చిమదేశాల సామ్రాజ్యవాదులూ. ఆసియాఖండంలోనూ నోబుసికి కిషి సింగ్మన్‌రీ, సారిట్ తానరాట్, నుగోదీన్ డీమ్, జంగ్‌కై షెక్ మున్నగు వివిధ దేశాల అభివృద్ధి నిరోధకులూ వున్నారు. (అయితే జంగ్ కై షేక్ టిబెట్టుకు స్వాతంత్రం ఇవ్వాలనడు, టిబెట్టు తైవాన్‌కు చెందాలంటాడు!) కొన్ని దేశాలలో వుండే కొన్ని పెట్టుబడిదారీ సెక్షన్లు— మామూలుగా వాటి రాజకీయ వైఖరిపై పెద్దమనుష్యుల వైఖరికి భిన్నంగా వుంటూవున్నా— ఈ టిబెట్టు సమస్యపై సామ్రాజ్యవాదుల వైఖరినే అనుసరిస్తున్నాయి. ఉదాహరణకు ఇండియాలోని కొన్ని బూర్జువా శక్తులు ఇటువంటివి. ఇటువంటి ప్రజలు ప్రపంచంలోనూ, తమ దేశాలలోనూ కూడా తక్కువ సంఖ్యలోనే వున్నారు. కాని వారు ప్రచారక సాధనాలను పెద్ద ఎత్తున తమ స్వాధీనంలో పెట్టుకొని, ప్రస్తుతానికి ఈ సమస్యపై పెద్ద గందర గోళాన్ని రేగగొట్టుతున్నారు. ప్రపంచంలో బహుజనాభిప్రాయం టిబెట్టులో జరిగినది అభివృద్ధినిరోధక తిరుగుబాటు అనీ, దానిని అణచివేయటం న్యాయమనీ చెప్పుతారు. తిరుగుబాటుదారులకు వ్యతిరేకంగా చైనా ప్రజలు సాగించిన పోరాటాన్ని సోషలిస్టు దేశాలలోని ప్రజలు సంపూర్ణంగా బలపరుస్తున్నారు. పెట్టుబడిదారీ ప్రపంచంలో కూడా అధిక సంఖ్యాకులు చైనా ప్రజల పక్షానేవున్నారు. అన్ని దేశాల శ్రామిక ప్రజలూ, న్యాయమూ, అభ్యుదయములకై పోరాడే ప్రజలూ, విదేశీ దురాక్రమణనూ, విదేశీజోక్యాన్నీ ఎదిరించి పోరాడే జాతీయ బూర్జువా వర్గాలూ ఇట్టివారిలోవున్నారు. టిబెట్టులో విదేశీజోక్యాన్ని అంగీకరించటమంటే ఇండోనీషియా, సింహళం, కంబోడియా, నేపాలు, ఇరాక్, క్యూబా మున్నగు అనేక ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికా దేశాల అంతరంగిక వ్యవహారాలలో విదేశీయుల జోక్యాన్ని అంగీకరించటమేననీ, లేక, ఈ దేశాల సార్వభౌమత్వం ప్రాదేశిక భద్రతలను అతిక్రమించటాన్ని అంగీకరింటమేననీ ఈ జాతీయ బూర్జువావర్గాలకు తెలుసు. అయితే, కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో, చైనా వ్యతిరేక ప్రచార సాధనాల చప్పుడు మ్రోగినంత బిగ్గరగా న్యాయానికి నిలబడ్డ ఈ శక్తుల గొంతు ప్రస్తుతం విన్పించటంలేదు. కొంతమంది పాపం విచారం

వెలిబుచ్చుతారు— చక్కటి చైనా ప్రజా రిపబ్లికువున్నది; చక్కటి ఇండియా— చైనా మైత్రి నెలకొనివున్నది; టిబెట్టులో తిరుగుబాటు జరగకుండావుంటే ఎంత బాగుండేది : అని. వీరి ఉద్దేశాలుమంచివే కాని, టిబెట్టులో తిరుగుబాటు బయలుదేరి త్వరగా అణచివేయబడి, ఆ విధంగా ఒక పెద్దవిషయం మంచి ఫలితాలకు దారి తీసిందన్న విషయాన్ని వీరు గుర్తించటంలేదు. ఈ తిరుగుబాటు ద్వారా టిబెట్టులోని విప్లవంగతి త్వరితమైనది. టిబెట్టు ప్రజాతంత్రయుత మొనర్చబడటంలో టిబెట్టు వ్యవహారాల్లో విదేశీయులు వేలుబెట్టే చరిత్రఅధ్యాయం పూర్తిగా ముగుస్తుంది. ఇండియా - చైనామైత్రి నిజంగా ధృఢతరమవటానికి ఇది తప్పకుండా అవుసరం. క్లుప్తంగా చెప్పాలంటే, టిబెట్టు ప్రజలూ, మొత్తం చైనా ప్రజలూ ఈ వివిధ అభిప్రాయాలనూ జాగ్రత్తగా పరిశీలించి, పాఠాలు నేర్చుకోవటం అవుసరం; అంతేగాక, దానితోబాటు, అనేక పెట్టుబడిదారీ దేశాల ప్రజలు, మరీ ముఖ్యంగా టిబెట్టు సమస్యపై గాలిదుమారంరేగిన పెట్టుబడిదారీ దేశాల ప్రజలు కూడా వీటిని పరిశీలించి తమ కవుసరమైన పాఠాలను నేర్చుకోగలరు.

ఈ సందర్భంలో, శ్రీ నెహ్రూ ఇండియా లోకసభలో ఏప్రిల్ 27 వ తేదీన చేసిన ప్రకటనను గూర్చి చెప్పదలచుకొన్నాము. (సంపాదకవర్గంయొక్క షరా. "ఈ విమర్శనను వ్రాసిన తర్వాత శ్రీ నెహ్రూ ఇండియా రాజ్యసభలో మే 4 వ తేదీన ఇచ్చిన వుపన్యాసాన్ని చదివాము. ఈ వుపన్యాసంలోని ప్రధాన విషయాలు ఏప్రిల్ 27 వుపన్యాసంలోని విషయాలను దాటిపోలేదు. కాబట్టి మేము ఎట్టి మార్పులూ, చేర్పులూ చేయలేదు.") మార్చి 17 నుండి ఏప్రిల్ నెలాఖరు వరకూ శ్రీ నెహ్రూ పార్లమెంటులో టిబెట్టు సమస్యపై చేసిన వుపన్యాసాలలో ఇది 7 వది. "టిబెట్టు ప్రజలు రాష్ట్రీయ స్వపరిపాలనకై పడే ఆశలు" అనబడే వాటియెడ తనకు సానుభూతిగలదనీ, చైనా గావించిన "సాయుధ జోక్యానికి తాను వ్యతిరేకుడననీ శ్రీ నెహ్రూ అనేక సందర్భాలలో చెప్పారు. ఏప్రిల్ 27 న వారు గావించిన ప్రకటన మరింత క్రమరీతిలో వున్నది. ఈ ప్రకటన పూర్తి పాఠం మా పత్రిక ఏప్రిల్ 30 వ తేదీ సంచికలో ప్రకటించాము. అయినా, పాఠకుల సౌకర్యార్థం వారి ఈ ప్రకటనలోనుండి కొన్ని భాగాలను ఇక్కడ వుదాహరిస్తున్నాము. టిబెట్టులో జరిగిన తిరుగుబాటునుగూర్చి, దానిపై ఇండియాపాత్రను గూర్చి చాలావరకూ వీరి అభిప్రాయాలను క్లుప్తంగా ఈ ఉదాహరణలు వ్యక్తీకరిస్తున్నాయి.

"పరిస్థితులు నిస్సందేహంగా గడ్డుగా వున్నాయి. ఒకవైపున శక్తివంతమైన మిక్కిలి వేగంగా ముందుకు సాగిపోయే సమాజం వున్నది. మరొకవైపున, సంస్కరణ పేరుతో తన ఉనికికి ఎటువంటి ముప్పువస్తుందో అని భయపడే కదలికలేని, మార్పులేని సమాజంవున్నది. ఈ రెండింటి మధ్య దూరం చాలా

వున్నది; ఇవి కలుసుకొనేచోటు అనేదే దాదాపు లేదు. ఈలోగా కొన్ని రూపా లలో మార్పు అనేది తప్పనిసరిగా టిబెట్టుకు ప్రవేశించింది. రహదార్లు అతి త్వరగా అభివృద్ధి జెందాయి; చాలాకాలంగావున్న టిబెట్టు ఏకాంతం కొంతవరకూ భగ్నమైనది. ఈ విధంగా భౌతికమైన అడ్డుగోడలు అంతకంతకూ హెచ్చుగా తొలగించబడ్డా, మానసికమైనా, ఔద్వేగికమైన అడ్డుగోడలు పెరిగాయి. మానసిక మైనా, ఔద్వేగికమైనా యీ అడ్డుగోడలను దాటడానికి ప్రయత్నాలు చేయబడనైనా చేయబడలేదు. లేదా, చేసినా జయప్రదం కాలేదు.

"టిబెట్టులోని ఉన్నత వర్గాల అభివృద్ధినిరోధకులే" ఈ పరిస్థితికి పూర్తిగా బాధ్యులని చెప్పటం ఒక క్లిష్టమైన సమస్యను మిక్కిలి తేలికగా తేల్చివేయటమే అవుతుంది. చైనీయ మార్గాలద్వారా వచ్చినవార్తల ప్రకారమైనా టిబెట్టులో జరిగిన ఈ తిరుగుబాటు విస్తృతమైన స్థాయిలో వున్నదనీ, దానికి మూలం ఉన్నతవర్గాల, ప్రజలనేకాక ఇతరులను కూడా ఆవహించిన బలమైన జాతీయతా భావాలు అయివుంటాయనీ తెలుస్తున్నది. దీనిలో స్వప్రయోజనపరుల వర్గాలుజేరి దానివల్ల లాభం పొందాలని జూడటం నిస్సందేహమే. ఒక సన్నివేశాన్ని బూజుపట్టిన మాటలూ, ప్రయోగాలూ నినాదాలతో తేలికగా చెప్పజూడటం ఎన్నడూ సహాయ పడదు.

"దురదృష్టకరమైన ఈ పరిణామాల వార్తలు ఇండియాకు అందిన వెనువెంటనే బలమైనట్టీ, విస్తృతమైనట్టీ వ్యతిరేక భావాలు ప్రారంభమైనవి. ఈ వ్యతిరేక భావాలను ప్రభుత్వమేమీ తీసుకురానూలేదు; ఈ వ్యతిరేక భావాలు ప్రధానంగా రాజకీయమైనవికావు. భావోద్రేకం, జీవకారుణ్యాల మూలకంగా ఏర్పడిన (సానుభూతివల్లనే) ఈ వ్యతిరేక భావాలుకల్గాయి; ఇంతేకాదు; చిరకాలంగా ఏర్పడ్డ మత, సాంస్కృతిక సంబంధాల ద్వారా టిబెట్టు ప్రజలతో ఏర్పడ్డ బంధుత్వ భావాలుకూడా కొంతవరకు ఇందుకు కారణం. సహజంగా కల్గిన వ్యతిరేక భావాలేఇవి, ఇండియాలో కొంతమంది వీటిని అవాంఛనీయ మార్గాలలోకి మళ్ళించటం ద్వారా లాభపడాలని చూసినమాట వాస్తవమే. కాని భారతదేశ ప్రజ లలో ఇటువంటి వ్యతిరేక భావాలు ఏర్పడటం యదార్థం. ఇక్కడనే ఈ భావాలు ఇట్లా వుంటే టిబెట్టు ప్రజలలో వుండే భావాలు ఎట్లావుంటాయో అనేది వూహించవచ్చు. బహుశః ఇటువంటి మనోభావాలు ఆశియాలోని ఇతర బౌద్ధ దేశాలలో కూడా వుండివుంటాయి. ప్రధానంగా రాజకీయం కానట్టి ఇటువంటి మనోభావాలు ఇంత బలంగా వున్నప్పుడు రాజకీయ పద్ధతుల ద్వారానే వాటిని పరిష్కరించ బూనుకోవటం సవ్యంకాదు; సైనిక పద్ధతులద్వారా అసలే సాధ్యం కాదు. టిబెట్టులో జోక్యం కల్గించుకోవాలనే కోర్కె మనకు లేనేలేదు; చైనా భారతదేశాల మధ్య మైత్రిని నిలబెట్టటమే మనకువున్న కోర్కె అంతా; కాని

అదేసమయంలో టిబెట్టు ప్రజలయెడ మనకు సకల విధమైన సానుభూతివున్నది. ఈ దుర్గతియెడ మనము చాలా కలతజెంది వున్నాము. చైనాలోని అధికారులు వివేకంతో వ్యవహరించి, టిబెట్టు ప్రజలపై తమ బ్రహ్మాండమైన బలాన్ని వుపయోగించారనీ. టిబెట్టు ప్రాంతంయొక్క స్వపరిపాలనను గురించి తమకు తాముగానే ఇచ్చిన హామీలకు అనుగుణంగా వారి స్నేహపూర్వక సహకారాన్ని సంపాదిస్తారనీ మనం ఇంకా ఆశించుదాము. అన్నిటికీపైగా, ప్రస్తుతం సాగే పోరాటమూ, వధలూ ముగుస్తాయని మనం ఆశించుదాము."

"సంస్కరణ పేరుతో తన వునికికి ఎటువంటి ముప్పు వస్తుందో అని భయపడే, కదలికలేని, మార్పులేని సమాజం" అని శ్రీ నెహ్రూ టిబెట్టులోని ఏ రకం సమాజాన్నిగూర్చి చెప్పుచున్నారో విశదీకరించలేదు. కాని మొత్తం సమస్యకు నాంది సరీగ్గా యిదే. ఇక్కడనుండే మన చర్చ ప్రారంభం కావాలి: ఇక్కడనుండే చర్చ ప్రారంభం కాగలదు కూడా.

టిబెట్టులో వున్న సామాజిక వ్యవస్థ పెద్ద భూస్వాముల ఎస్టేట్లపై ఆధార పడిన దాస్య వ్యవస్థ. టిబెట్టులో మొత్తం భూమి, పశువులలో అత్యధికభాగం లాంటి ప్రధాన వుత్పత్తి సాధనాలన్నీ మూడు రకాలైన ప్యూడల్ ఎస్టేటు యజ మానులకు, లేదా దాస్యవ్యవస్థ యజమానులకు, అనగా ప్యూడల్ ప్రభుత్వ అధికార బృందానికీ, మఠాలకూ, ప్రభువులకూ చెందివున్నాయి. ఈ మూడు రకాలైన దాస్య వ్యవస్థ యజమానులూ మొత్తం టిబెట్టు జనాభాలో 100 కి 5 గురు.గా, అనగా మొత్తం 12 లక్షల జనాభాలో 60 వేలుగా వున్నారు. రైతులలో ఎవ్వరికీ, పశుకాపర్లలో అత్యధిక సంఖ్యాకులకూ తమ స్వంతభూమిగాని, పశువులుగాని లేవు. వారు దాస్య యజమానులకు ఊడిగం చేయటమే పని. తరతరాలుగా వారూ, వారి సంతానమూ ఏదో ఒక దాస యజమానికి చెందివుంటూ వచ్చారు. ఈ దాస యజమానుల ఎస్టేట్లలో ఒకభాగం ప్యూడల్ ప్రభుత్వం సేవకై కేటాయించబడి వుంటుంది. ఈ విధంగా కేటాయించబడిన భూమిని సాగుజేసే దాసులు ప్యూడల్ ప్రభుత్వానికి అనేక రకాలైన వెట్టిచాకిరీ చేయవలసి వుంటుంది. ఇటువంటి భూమిలో పనిజేసే దాసులలో కొంతమంది మిలిటరీ సేవకూడా చేయాలి. ఎస్టేట్లలో మిగతాభాగం దాసయజమానులయొక్క "స్వంత కమతాలు". యిటువంటి స్వంత కమతం భూమి యావత్తూ దాసులు తమ స్వంత పశువులతోనూ, స్వంత పనిముట్లతోనూ కొన్ని సందర్భాలలో తమ తిండిని తామే తెచ్చుకుంటూ కూడా సాగుచేయాలి. ఇందుకు ప్రతిఫలంగా నాసిరకం భూమిలో ఒక పాలును ప్రభువుకు వున్న భూమిలో పదింట మూడోవంతు భూమిని — ఈ దాసునికి సాగుచేసు కొంటానికి యివ్వటం జరుగుతుంది. ఈ విధంగా దాస ప్రభువుల భూమిని సాగు చేయటంలోనే దాసులు ఏడాదిలో ఎక్కువకాలాన్ని వెచ్చిస్తూ, పైపెచ్చు అనేక

రకాల వెట్టిచాకిరీనికూడా చేస్తూవుంటారు. పైన జెప్పబడ్డ రెండు రకాల ఎస్టేట్ల లోనూ, దాసుల శ్రమ ఫలితంగా వుత్పత్తిఅయ్యే సంపదలో 100 కి 70 పాళ్ళు ప్రభువుల జేబులలోకి పోతూవుంటుంది. తమ ఆదాయాలతో తమ కుటుంబ పోషణను జేసుకొనటం కష్టం గనుక యీ దాసులు అధిక వడ్డీలపై అప్పులను తెచ్చుకోటానికి దాసయజమానుల వద్దకు వెళ్ళవలసి వుంటుంది. ఈ విధంగా అప్పులు తీసుకొన్న దాసులలో అత్యధిక సంఖ్యాకులు వాటిని తీర్చలేరు. కొన్ని వందల ఏండ్ల పాత అప్పులుకూడ యీనాటికీ వుండటం కద్దు. దాసులకు ఏలాంటి రాజకీయ హక్కులూ లేవు సరికదా, చివరకు తమ యిచ్చవచ్చిన చోటుకు పోయే హక్కుకుకూడా నోచుకోలేదు. కొద్దిరోజులు ఎటుఅయినా వెళ్ళాలన్నా ఎస్టేటు యజమానినుండి అనుమతి తీసుకోవలసిందే. టిబెట్టు ప్రభువర్గం వంశపారంపర్య రీత్యా వస్తున్నట్టిది. ప్రస్తుతం రెండు మూడు వందల ప్రభువుల కుటుంబాలు వున్నాయి. వారి వారి ఆస్తులనుబట్టి వారి హోదా వుంటూవుంటుంది. అందరిలోకీ పెద్ద ప్రభువుల కుటుంబాలు దాదాపు 20. అనగా మొత్తంలో 10 వ వంతు వుంటాయి. వీటిలో ఒక్కొక్క కుటుంబానికీ అనేక డజన్ల ఎస్టేట్లూ, వేలకొలదీ దాసులూ వున్నారు. టిబెట్టు ఫ్యూడల్ ప్రభుత్వంలో అధికారం ఎల్లప్పుడూ యీ పెద్ద ప్రభువుల చేతులలోనే వుంటూవచ్చింది. దాసులకూ, దాస ప్రభువులకూ అంతస్థులలో వుండే తేడాలు అతి కఠినమైనవి. ప్రభువులను చూడగానే దాసులు ఆ మార్గనుండి తప్పుకొనియైనా పోవాలి. లేదా, తమ భయాన్ని కన్పరుస్తానికిగాను వంగి దండాలు పెడుతూ, నాలుకలు బైటకు చాపాలి. మాట్లాడేటప్పుడు కూడా ఎట్టి తప్పులూ దొర్లకుండా వుండటానికిగాను ప్రత్యేకమైన సంభాషణ సరళిని అనుసరించాలి. పారిపోయి పట్టుబడ్డ దాసులనుగాని, ఇతరత్రా చట్టాలను అతిక్రమించిన దాసులనుగాని తమ యిష్టంవచ్చినట్లు చిత్రహింసల పాల్జేస్తానికి ప్రభువులకు హక్కువున్నది. అతి సాధారణమైన కొరడాదెబ్బల శిక్షకు తోడుగా కళ్ళు పీకివేయుటమూ, ముక్కు, చేతులు నరికివేయటమూ, మోకాటి చిప్పలను వూడ గొట్టటం మున్నగు అతి రాక్షసహింసలు కూడా అనుసరించబడుతూ వున్నాయి.

టిబెట్టు సామాజిక జీవితంలో మఠాలు చాలా ముఖ్యమైన స్థానాన్నికల్గి వున్నాయి. మఠాలు సాగించే సరైన మతవిధులనూ, ప్రజలయొక్క మత స్వాతంత్ర్యాన్ని ఎల్లవేళలా కాపాడుతూ, గౌరవించుతూ వుండవలసినదే. కాని ఇంతవరకూ మఠాధిపతులందరూ దాస ప్రభువులుగా కూడా వుంటూవస్తూన్నారు. దాసులను అధికారబృందమూ, ప్రభువులూ దోచుకొనే దానికన్న అధిక వడ్డీలు, వ్యాపారముల ద్వారా మఠాలు దోచుకొనటం మరీ దారుణం. వీటికి అదనంగా మతం పేరుతో మఠాలు దాసులను దోచుకోవడం కూడా వున్నది. మఠాలలో వివిధ అంతస్థుల హోదాలుకూడా చాలా ఖచ్చితంగా వుంటాయి. దాసుల కుటుం

బాలనుండి వచ్చేలామాలూ, బీదలామాలూ కూడా మతాలచే దోచుకోబడుతూ వుంటారు. చిత్రహింసల కుపయోగపడే వివిధ వుపకరణాలను, జైళ్ళనూ ప్రతి మతమూ కలిగివుంటుంది. తమ యిష్టంవచ్చినట్లు ఈ మతాలు తమ దాసులనూ, తక్కువ హోదా లామాలనూ శిక్షించవచ్చును. ఇతర దాస ప్రభువులు ఇచ్చే శిక్షలకు ఈ శిక్షలేమీ తీసిపోవు.

ఉజ్జాయింపుగా చెప్పాలంటే ప్రభువులూ, మతాలూకలసి టిబెట్టులోని మొత్తం భూమిలో 100 కి 30 వంతులను కలిగివుంటారు. దాదాపు 100 కి 40 వంతులు భూమి ఫ్యూడల్ ప్రభుత్వానికి చెందివుంటుంది.

ఇటువంటి అభివృద్ధినిరోధకమైన, అజ్ఞాన పూరితమైన క్రూరమైన, అనాగరికమైన దాస్యవ్యవస్థపై ఆధారపడిన సమాజంలో రాజకీయ మత కార్య కలాపాలన్నింటికీ ఈ స్వల్పసంఖ్యాకమైన పెద్ద దాస యజమాలు కేంద్రంగా వుంటారనటంలో సందేహంలేదు అతి జుగుప్సాకరమైన అవినీతి, అంతరంగిక కలహాలూ అన్నీ తప్పనిసరిగా ఈ పెద్దదాస యజమానులనుండే బయలుదేరుతాయి. దలైలామాచుట్టూజేరి చక్రం తిప్పుతూవుండే పెద్దహోదా అధికారులు అధికారం కొరకు, స్వలాభాల కొరకూ గాలించిన కుట్రలలో అసంఖ్యాకమైన హత్యలూ, విషప్రయోగాలూ జరిగాయి. శ్రీ నెహ్రూ చెప్పేటట్లుగా. ఈ రకం జనం బేషరతుగా దలైలామాను గౌరవించటం అనేది జరగటంలేదు. వాస్తవం ఇందుకు పూర్తిగా విరుద్ధంగావుంది. తరచు దలైలామాను తమ చేతులలో కీలుబొమ్మగా చేసుకోవటం. తమ అభిప్రాయాలను ఆయనపై బలవంతంగా రుద్దటం, అవసర మనుకొంటే ఆయనను చంపటం కూడా జరుగుతూవచ్చింది. ఉదాహరణకు, 11 వ దలైలామా, తన 18 వ యేట 1855 లో, పొటాలా రాజప్రాసాదంలోనే అకస్మాత్తుగా మరణించాడు. ఆటుపిమ్మట. 12 వ దలైలామా కూడా. తన 20 వ ఏట, 1875 లో పొటాలా రాజప్రాసాదంలోనే ఆకస్మిక మరణం జెందటం సంభ వించింది. టిబెట్టుపై బ్రిటిష్‌వారు దురాక్రమణ జరిపిన తదనంతరం. తమ కుట్ర దారుల ముఠాకు చెందని వారిని అంతమొందించటానికై టిబెట్టులోని ఉన్నతవర్గ అభివృద్ధినిరోధకులు మరీ హేయమైనట్టి, క్రూరమైనట్టి పద్ధతులను అవలం భించారు. 1923 లో 9 వ పంచన్‌లామా టిబెట్టును వదలి దేశ అంతర్భాంగలోకి పారిపోయి జీవితశేషం అంతా అక్కడే గడిపేటట్లుగా వీరు చేసారు. దలైలామాకు రాజప్రతినిధిగా ఎనిమిదేండ్లు వ్యవహరించిన రాబ్చన్‌హుటుకు 1947 లో అరెస్టుచేయబడి. జైలులో గొంతునులిమి హత్యచేయబడ్డాడు. అదే సంవత్సరంలో మున్సోరీలో ప్రస్తుతం 14-వ దలైలామా తండ్రి కూడా, ఆతనికున్న దేశభక్తి పూరిత భావాలకుగాను, సామ్రాజ్యవాదులతో సంబంధాలున్న అభివృద్ధినిరోధకుల చేతులలో విషంవల్ల మరణించాడు.

దలైలామాపై తమ పట్టును చులకన చేసుకొంటానికిగాను ఈ అభివృద్ధినిరోధకులు ఈ హత్యను గావించారు. టిబెట్టు శాంతియుత విమోచనమునకై పనిచేసిన బుద్ధ అవతారుడు గెడా భాముడోవద్ద విషప్రయోగంవల్ల హత్యగావింపబడ్డాడు. ఏవిధమైన ఆచూకీ దొరకకుండా ఆయన కళేబరం వెంటనే దహనం చేయబడింది. టిబెట్టులో జోక్యం కలగచేసుకోవాలనే విదేశీయుల గులాములుగా పనిజేసి టిబెట్టు పరిపాలక ముఠాగావించిన ఘోర నేరాలే ఇవన్నీ కూడా.

గతంలో యీ సమాజం చలనరహితంగా పడివుంది. ఆర్థిక వ్యవస్థ హీనంగా వుండటం, సంస్కృతి చాలా వెనకబడి వుండటమే కాకుండా జనాభా పెరగటంకూడా సాధ్యంకాకుండా వుండిపోయింది. అయినప్పటికి యిటువంటి సమాజంయొక్క వ్యవస్థ ఈషణ్మాత్రమైనా "సహనంగలది" గాని, "కారుణ్య భరితమైనది"గా గాని కానేకాదు.

టిబెట్టు ప్రజలకు తాము సానుభూతిపరులమని స్వంతంగా డబ్బా వాయించుకొనే పెద్దమనుష్యులను ఒక ప్రశ్న అడగదలచుకొన్నాము: మీరు సానుభూతిని చూపే "టిబెట్టు ప్రజలు" ఎవరు? టిబెట్టుయొక్క స్వపరిపాలన లేక స్వాతంత్ర్యం అని మీరు చాటేది ఏ టిబెట్టుయొక్క స్వపరిపాలన. "స్వాతంత్ర్యం"? టిబెట్టులో తిరుగుబాటు ఓడిపోయింది అని మీరు వాపోయే ఓటమి ఎవరిది? నిజానికి "సానుభూతిపరులు" అని చాటుకొనేవారిలో చాలామంది కేవలం టిబెట్టు ప్రజల యొక్క పేరునూ, టిబెట్టు స్వపరిపాలన పేరునూ, మానవత్వం పేరునూ దుర్వినియోగం మాత్రమే చేస్తున్నారు. వారు సానుభూతి చూపేది టిబెట్టు ప్రజల యెడ కాదు; తరతరాలుగా టిబెట్టు ప్రజలను అణచివుంచి, దోచుకొని, ఊచకోత గోసిన వారియెడ; టిబెట్టులో నెలకొనివున్న నరమాంసభక్షక వ్యవస్థకు అధినేతలైన వారియెడ. టిబెట్టులోని దాసయజమానులు దాసులయొక్క కళ్లు, గుండెలూ పెరికివేస్తూన్నప్పుడు సానుభూతితో ఉత్తీర్ణులైన యీ పెద్దమనుష్యులు యీ దారుణాలను దారుణాలుగా భావించలేదు; దాసయజమానులకు సహనాన్నీ, మానవత్వాన్నీ చూపమని చెప్ప బుద్ధిపుట్టలేదు. తమ స్వంతదేశం భూభాగంపైననే మకాం వుంటున్న ప్రజావిమోచన సైన్యంపై యీ పెద్ద దాసయజమానులు దాడులు చేస్తూవున్నప్పుడు, ప్రజావిమోచన సైన్యంలోని సైనికులనూ, ప్రజా ప్రభుత్వ వుద్యోగులనూ బంధించి చిత్రవధల పాల్జేస్తూవున్నప్పుడూ యీ సానుభూతిపరులు "భళి భళీ" అన్నారేగాని, వంద సంవత్సరాలవరకూ యీ బడా దాసయజమానులు గెరిల్లా యుద్ధాన్ని కొనసాగించగలరని బీరాలు పల్కారేగాని వారికి సహనాన్నీ, జీవకారుణ్యవాదాన్నీ బోధించ పూనుకోలేదు. కాని, తిరుగుబాటును యింకా పట్టుదలతో కొనసాగిస్తూవున్న తోడేళ్ళకు వ్యతిరేకంగా ప్రజావిమోచన సైన్యం ఆత్మరక్షణ వ్యూహంనుండి ఎదురు దాడి వ్యూహానికి వుపక్రమించినప్పుడే. అనగా,

సాయుధ దోపిడిగాంధ్ర తిరుగుబాటు ఓడిపోవటం ఫలితంగా ప్రపంచంలోకెల్ల అతి క్రూరమైన, అమానుషమైన దాస్య వ్యవస్థ చిట్టచివరకు సంక్షోభంలో పడినప్పుడు మాత్రమే కట్టలు తెంచుకొని వచ్చే మహాప్రవాహంలాగా అతి విషాద సంఘటన అనీ, సానుభూతి అనీ, మానవత్వం అనీ, స్వపరిపాలన, స్వాతంత్ర్యాలు అనీ కేకలూ, పెడబొబ్బలూ ధారాప్రవాహంగా వెలువడసాగాయి పరిస్థితిని పొరపాటుగా అర్థం చేసుకొన్న వారిని కొందరిని మినహాయిస్తే యీ కేకలువేసే తక్కినవారంతా మిక్కిలి అభివృద్ధి నిరోధకమైన దాస్య విధానాన్ని, మిక్కిలి క్రూరమైన దాస యజమానులనూ బలపర్చేవారేననీ, టిబెట్టు ప్రజల విమోచనాన్నీ, స్వాతంత్ర్యాన్నీ వ్యతిరేకించే శత్రువులేననీ దీనినిబట్టి తెలుస్తూనేవున్నది. మేటర్నిక్ తరహా విప్లవ ప్రతీఘాతక "పవిత్ర మిత్రకూటమి" వంటి బంధంతో అమెరికా విదేశాంగ శాఖ, బ్రిటిషు సామ్రాజ్యవాదులూ, దక్షిణ కొరియా అధిపతి సింగ్మన్‌రీ, దక్షిణ వియత్నాం అధిపతి అగు దీన్ దీమ్, చైనాయొక్క జంగ్ కై షేక్, ఇండియా లోని అభివృద్ధినిరోధక పార్టీలైన ప్రజాసోషలిస్టుపార్టీ, జనసంఘములూ ముడిపడి వుండటంకూడా సరీగ్గా యీ పై కారణంవల్లనే. ఇందులో ఆశ్చర్యపడవలసిన దేదీలేదు.

మాకు ఆశ్చర్యం కల్గించిన దేమిటంటే భారతదేశ ప్రధాని శ్రీ నెహ్రూ ఒకవైపున మిత్రకూటమిలోని అపఖ్యాతిపాలైన అనేక శక్తులతో స్పష్టంగా పెద్ద వైరుధ్యాలను కల్గివుంటూ యీ శక్తుల కుట్రలూ, కుహకాలూ భారతదేశానికీ, చైనా - భారతదేశాల మైత్రికీ, స్వయంగా నెహ్రూకు కూడా అనర్థదాయకం అని గ్రహించాడు; కాని, మరొకవైపున టిబెట్టుకు సానుభూతి అనబడే వుద్యమంలో ఒక ప్రధాన పాత్రనువహించే విధంగా యీ కూటమిచే అప్రయత్నంగానే ఆయన యీడ్వబడ్డాడు. ఆ విధంగా, క్రింద పెద్దపులులు పోట్లాడుకుంటూవుంటే కొండ కొమ్మలనుండి చూసి ఆనందించినట్లుగా వారు ఆనందపడటానికి వారికి అవకాశం యిచ్చాడు. ఈ మా వ్యాఖ్యద్వారా శ్రీ నెహ్రూతో వాదనలోకి లాగబడటానికి మేము చాలా బాధపడుతున్నాము. శ్రీ నెహ్రూ మా పొరుగున వున్న మిత్రదేశమైన భారత దేశానికి పూజ్యనీయుడైన ప్రధాన మంత్రి; ప్రపంచంలో ఎంతో ప్రఖ్యాతిగల రాజకీయవేత్తలలో ఒకరు. మరీ ముఖ్యంగా వీరు చైనాకు మిత్రులనే విష యాన్నీ, యుద్ధం, దురాక్రమణలకు మూలకందమైన సామ్రాజ్యవాద పంథాకు వ్యతిరేకి అనే విషయాన్నీ మేము మరువలేము. అంతేకాదు : సామాజిక పురో గమనాన్ని గూర్చి వెలుగును వెదజల్లే అనేక ప్రకటనలను వారు చేశారు. ఉదాహరణకు : 1934, 1935 లో వారు జైలులో వ్రాసిన తమ "స్వీయచరిత్ర"లో కమ్యూనిజమును గురించి చాలా పొరబాటు అవగాహనలనూ, విరుద్ధ భావాలనూ కనపర్చినా (బూర్జువా వాతావరణంచే పోషింపబడిన "విరుద్ధభావాలు అన్నింటివల్లా"

ఒక "నమూనా బూర్జువా"గా తయారైన వాడనని ఆయన ఆ గ్రంథంలోనే ఒప్పుకున్నాడు). గత చరిత్రకూ, ప్రస్తుత ఘటనలకూ శాస్త్రీయ పద్ధతులను అనువర్తింపజేయటంవల్ల "ఈనాడు ప్రపంచంలో జరిగే మార్పులను గూర్చిన మిక్కిలి నిశితమైన, సరైన అనుశీలన మార్క్సిస్టు రచయితలనుండే వస్తున్నది" అని ఒప్పుకొన్నారు. ఆయన యింకా యీ విధంగా వ్రాశాడు: ప్రజలలోని గ్రూపుల యొక్కా, వర్గాలయొక్కా రాజకీయ భావాలు ఆర్థిక ప్రయోజనాలవల్లనే రూపొందుతాయి. హేతువాదంగాని, నైతిక కారణాలుగాని యీ ఆర్థిక ప్రయోజనాలను అధిగమించలేవు. వ్యక్తులు విడిగా పరివర్తనం పొందవచ్చు. చాలా అరుదుగా జరిగినా యీ వ్యక్తులు తమ ప్రత్యేక ప్రయోజనాలను వదలుకోవచ్చును; కాని వర్గాలుగాని, గ్రూపులుగాని ఆ విధంగా చేయవు. కాబట్టి, పరిపాలక వర్గంవుంటూ, విశేష స్వాధికారాలనుగలవర్గంచేత అధికార విసర్జనచేయుటకూ, విశేషాధికారాలను త్యాగంచేయుటకూ చేసిన ప్రయత్నాలన్నీ ఇంతవరకూ విఫలమైనాయి; ఇక ముందు సఫలమవుతాయన్న ఆశకు ఎక్కడా ఆస్కారం కూడా లేదు."

"శ్రీ నెహ్రూ ఈ విషయాలను ఇక్కడ చాలా సరిగ్గా చెప్పాడు. కాని 1959 ఏప్రిల్ 27 తేదీన చేసిన ప్రకటనలో శ్రీ నెహ్రూ గావించిన రాగవరుస ఎంతవేరుగా వున్నది! ఆయన తాను ఒకప్పుడు వెల్లడించిన భావాలను సంపూర్ణంగా వదలుకొనియైనా వుండాలి. లేదా, ఆయన తాను అర్థంచేసుకొన్నాననుకొన్న శాస్త్రీయ మార్క్సిస్ట్ పద్ధతులను నిజంగా అర్థంచేసుకొలేక పోయియైనా వుండాలి. ఇప్పుడు ఆయన టిబెట్టులో విశేషస్వాధికారాలను కల్గివున్న పరిపాలక వర్గానికి నచ్చచెప్పి ఆ వర్గం తన అధికారాన్నీ, విశేషస్వాధికారాలనూ విసర్జించుకొనేటట్టు మార్చలేక పోయామని మమ్మల్ని నిందిస్తున్నాడు, టిబెట్టులో సామాజిక వ్యవస్థను గూర్చిన వర్గ అనుశీలనను "బూజుపట్టిన మాటాలూ, ప్రయోగాలూ, నినాదాలు" గా ఒక్క మాటలో కొట్టిపారవేయ జూస్తున్నాడు. అంతే కాదు; దాసులు, దాస యజమానులనే మిక్కిలి వైషమ్యాలుగల రెండు వర్గాలనూ కలిపి, "సంస్కరణ పేరుతో తన వునికికి ఎటువంటి ముప్పువస్తుందో అని భయపడి" ఒకే సమాజవ్యవస్థగా చిత్రిస్తూన్నాడు. కాని, శ్రీ నెహ్రూ యొక్క ఈ ప్రయత్నంతో అంగీకరించటం మాకు అసాధ్యంగా కన్పడుతోంది. టిబెట్టు సమాజంలో వర్గ వైషమ్యాలుండుటమనేది జీవిత యథార్థం. ఈ విషయం మాటలు, ప్రయోగాలు, నినాదాల విషయం మాత్రమేకాదు. బూజుపట్టిన విషయం అంతకు ముందేకాదు. సంస్కరణలు చేయాలంటే కొన్ని చర్యలు దీసుకోవాలి; సహజంగా అటువంటి చర్యలు సంస్కరణలు కోరే అత్యధిక సంఖ్యాక ప్రజల ప్రయోజనాలకు అనుకూలంగానూ, సంస్కరణలను గట్టిగా వ్యతిరేకించే

అత్యల్ప సంఖ్యాకుల ప్రయోజనాలకు మాత్రమే భంగకరంగానూ వుండాలి. ప్రస్తుతం టిబెట్టులోవున్న పరిస్థితులబట్టి, జనాభాలో 100 కి 95 మందిగావున్న 11,40,000 ప్రజలకూ సంస్కరణలు ప్రయోజనకరంగా వుండాలి. ఇక జనాభాలో 100 కి 5 వంతుగా మాత్రమేవున్న 60,000 మంది విషయంలో పరిస్థితులు వేర్వేరుగా వుంటాయి. వారిలో అత్యల్ప సంఖ్యాకులు మాత్రమే సంస్కరణలను పట్టుదలతో వ్యతిరేకిస్తూ, సాయుధతిరుగుబాటును లేవదీసేటంత వరకూ, చివరి వరకూ పశ్చాత్తాపపడటమనేది ఎరగకుండా వ్యతిరేకించే వరకూ తయారౌతారు. మేము చెప్పినట్లుగా, తిరుగుబాటు చేసిన 20,000 ఆ సుమారులోవున్నవారిలో అధిక సంఖ్యాకులు, అనేక ఇతర విప్లవ ప్రతీఘాత సైన్యాల విషయంలో వలెనే, బలవంతంగానో, మోసంవల్లనో, తిరుగుబాటుకు ప్రేరేపింపబడినవారు. తిరుగు బాటు దార్లలో మూడవ వంతుగావున్న ఖంబాలను మినహాయిస్తే, తిరుగుబాటు దార్లలోజేరిన టిబెట్టు ప్రజలు మొత్తం టిబెట్టు జనాభాయైన 12 లక్షల మందిలో 100 కి 1 వంతుకన్న ఎక్కువ వుండరు. టిబెట్టులోవున్న మొత్తం ఉన్నత వర్గాల వారందరూ తిరుగుబాటు జేసేవారనటం పొరబాటు. అంతేగాదు: ఈ 60,000 మందిలోనూ, సంస్కరణలను ఆమోదిస్తూవుండే సంస్కారంగల వారు తగిన సంఖ్యలోవున్నారు. కొబట్టి ఉన్నత వర్గాల సభ్యులలోకూడా వున్న తేడాలను గమనించి, వీరియెడ ఉచితవైఖరిని అవలంబించటం అవసరం. మేము ఎల్లప్పుడూ యిదే వైఖరిని అవలంబిస్తూ వచ్చాము. కాబట్టి మేము పైన పేర్కొన్నట్లుగా వివిధ పరిస్థితులలో వున్న వేర్వేరు సభ్యులందరూ సంస్కరణలంటే ఒకేరకమైన భయాన్ని కల్గివున్నారనీ, సంస్కరణలయెడ ఒకేవిధమైన మానసిక, భావోద్రేకపు అడ్డుగోడలను కట్టుకు కూర్చున్నారనీ తలంచటం వాస్తవ పరిస్థితు లకు వ్యతిరేకం. సంస్కరణలు కోరే అత్యధిక సంఖ్యాకులైన ప్రజలు సంస్కరణ లంటే యెందుకు భయపడాలి? మానసిక, భావోద్రేకపు అడ్డుగోడలను యెందుకు కట్టుకోవాలి?

టిబెట్టు సామాజిక వ్యవస్థనుగూర్చి మాట్లాడేటప్పుడు, సంస్కరణలను వ్యతిరేకించకపోయినా, స్వప్రయోజనపరవర్గాలు తిరుగుబాటులో వహించిన పాత్రను కాదనలేకపోయినా, మొత్తంమీద శ్రీ నెహ్రూ అతిదారుణమైన దోపిడీ విధానాన్నిగూర్చి మాట్లాడకపోవటమేగాక దోచుకోబడే అత్యధిక సంఖ్యాక ప్రజ లనూ, అత్యల్ప సంఖ్యాకులైన దోపిడీగాండ్రనూ దాదాపు కలగాపులగంచేసి ఒక సమూహంగానే చూస్తున్నారు. ఈ ప్రాతిపదికపై బయలుదేరి, చేతివ్రేళ్ళమీద లెక్కించబడగల్గినంత కొద్దిమంది ఉన్నతవర్గ అభివృద్ధి నిరోధకులే యీ తిరుగు బాటును లేవదీశారన్న విషయాన్నీ కాదంటున్నారు; ఈ తిరుగుబాటును అణచివేసే చైనా ప్రజల సక్రమచర్యను 'విషాదగాధ'గా చిత్రిస్తున్నారు. పైగా యీ తిరుగు

బాటుకు తమ సానుభూతిని ప్రకటిస్తున్నారు. ఈ విధంగా వారు మిక్కిలి సంతాపకర మైన తప్పును చేస్తున్నారు. భారతదేశపు మిత్రులముగానూ, ఏ ప్రజల పరిస్థితులను గూర్చి శ్రీ నెహ్రూ చర్చిస్తూవున్నారో ఆ ప్రజలం కొబట్టీ మేమీ తప్పును యెత్తి చూపవలసి వస్తున్నది. శ్రీ నెహ్రూ తర్కంతో గనుక అంగీకరిస్తే టిబెట్టులో విప్లవమేగాక, దానితోబాటు మొత్తం చైనా విప్లవమే అనుచితమైనట్టిదిగా అంగీకరించాలి. విముక్తికి పూర్వం హాన్‌జాతి నివసించే చైనా భూభాగం దాస్య పద్ధతిలో లేకపోయినప్పటికీ ఫ్యూడల్ వ్యవస్థ పరిధిలోనుండి యింకా పూర్తిగా బయటపడలేదన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. అదికూడా ఎల్లప్పుడూ స్తబ్ధమైనట్టి; మార్పులేనట్టి దేనితోనూ సంబంధలేకుండా ఏకాకిగా వున్నట్టి వ్యవస్థగా వుండేది. చైనాదేశపు ప్రత్యేక పరిస్థితులకు ఏమాత్రమూ అనుగుణ్యం కానట్టి మార్క్సిజం - లెనినిజం అనే ఒక బూజుపట్టిన, పాసి పోయిన, మిక్కిలి చవుకబారుదైన దిగుమతి సిద్ధాంతం పట్టుకు బయలు దేరామని మమ్మలను యీసడించినవారు కూడా లేకపోలేదు. మొత్తం సమాజం, మొత్తం జాతి మా సంస్కరణోద్యమాన్ని గట్టిగా ప్రతినిరోధిస్తుందని వారు నొక్కి వక్కాణించేవారు. వారింకా మమ్మల్ని జాతిని చీల్చేవారముగా, దేశానికి ద్రోహం చేసేవారముగా, మాస్కోనుండి వచ్చే ఉత్తర్వుల ప్రకారం "ఎర్ర సామ్రాజ్యవాదం" యొక్క ఏజంట్లుగా పనిచేసేవారముగా, యీ విధంగా యింకా ఎన్నో విధాలుగా దూషించారు. చరిత్ర యిప్పుడు తన తీర్పును యిచ్చింది. వారు కాదు, మేము న్యాయపంథాలో వున్నామని రుజువైంది. కమ్యూనిస్టులపై చేయబడ్డ దాడులూ, నీచారోపణలూ పూర్తిగా దివాళాతీశాయి. ఒకప్పుడు స్తబ్ధంగా, మార్పు లేకుండా పడివున్న చైనా శ్రామికవర్గం నాయకత్వాన వున్నట్లుండి శక్తిసంపన్న మైన అతిత్వరగా ముందుకు పురోగమించే చైనాగా మారిపోయింది. మార్క్సిస్టు-లెనినిస్టు అనుశీలనం ప్రపంచంలో ఎక్కడనైనా వర్తిస్తుందనటానికి యిదొక తిరుగులేని నిదర్శనం. ఉత్పత్తి సంబంధాలు వెనుకబడి వుండటం మూలకంగా ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి బంధాలుపడి, తన్మూలకంగా గతంలో సమాజ పరిణామంలో స్తబ్ధత ఏర్పడింది. మొత్తం జాతియొక్క, తమ మాతృదేశం యొక్క ప్రయోజనాలకు నిజంగా ప్రాతినిధ్యం వహించేది మార్క్సిస్టు-లెనినిస్టులూ, కమ్యూనిస్టులే; మొత్తం జాతి ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తు న్నట్లుగా నటించే కొలదిమంది కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులు తాత్కాలికంగా ప్రజలలో ఒకభాగాన్ని కళ్ళుగప్పివుంచినా, నిజానికి సామ్రాజ్యవాదం ఏజంట్లుగా బయటపడ్డారు. చైనాదేశ చరిత్ర నేర్పే యీ పాఠాన్ని ప్రధాని నెహ్రూ బహుశః కాదనరని మేము అనుకొంటాము. కాని టిబెట్టు సమస్యపై శ్రీ నెహ్రూ తర్కం ప్రకారం "టిబెట్టు ప్రజలకు" మాత్రమే ఆయన సానుభూతి పరిమితమై వుండక,

మొత్తం "చైనా ప్రజలు" అందరికీ విస్తరించినట్లయితే, మొత్తం చైనా విప్లవం అనేకరెట్లు విచారకరమైనట్టి, కనివిని ఎరుగని బ్రహ్మాండమైన "విషాదచర్య"గా అయివుండేది. ఈనాటి టిబెట్టు విద్రోహుల 20,000 సంఖ్యకన్న, చైనా ప్రజా విమోచన యుద్ధకాలంలో జంగ్ కై షేక్ కొమింగ్టాంగు, కూమింగ్టాంగు సైన్యాలూ ఎన్నోరెట్లు హెచ్చుగా వుండేవి; కాబట్టి వారు "ఉన్నతవర్గాల అభివృద్ధి నిరోధకులు" కాదనీ, యుద్ధం మరింత పెద్దయెత్తున సాగిందనీ చెప్పటానికి మరీ యెక్కువ "కారణాలు" వున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, మరీ బలమైనటువంటి "సానుభూతి"ని అది సంపాదించి వుండవలసింది. అయినప్పటికీ, మాకు తెలిసినంతవరకూ మొత్తం చైనాకు శ్రీ నెహ్రూ సానుభూతి చూపినప్పుడు హాన్‌జాతిలోని "పెద్ద దాసయజమానుల" యెడ మాత్రం ఆ సానుభూతిని చూపలేదు. కాని యిప్పుడు చైనాలోని భాగమైన టిబెట్టుయెడ శ్రీ నెహ్రూ సానుభూతి చూపేటప్పుడు ఆయన సానుభూతి టిబెట్టుయొక్క "చిన్న జంగ్ కై షేకులకు" చూపబడుతూ వున్నది. ఈ విధమైన విస్పష్టమైన వైరుధ్యం ఎట్లా సంభవిస్తున్నది?

తాను చెప్పినది టిబెట్టుకు మాత్రమే పరిమితమైనదనీ, టిబెట్టు జాతి హాన్ జాతినుండి భిన్నమైన్నదనీ, కాబట్టి మా విమర్శన న్యాయంగాలేదనీ బహుశా శ్రీ నెహ్రూ చెప్పవచ్చు. అంటే, టిబెట్టు ప్రజలలో విప్లవాన్ని సాగించటంలో హాన్ ప్రజలకు జాతుల మధ్య అడ్డగోడలు ఎదురు తగులుతాయని చెప్పటమన్న మాట. టిబెటన్లు, హాన్ ప్రజలనుండి భిన్నమైన వారనుట సత్యమే, కాని అంతటితో సరిపోదు. మంగోలియన్లు, ఉయిఘర్లు, చువాందులు, హుయిలు, మియోలు, కొరియన్లు, తదితర మైనారిటీ జాతులన్నీ కూడా హాన్ జాతి నుండి భిన్నమైనట్టివే. కాబట్టి చైనా కమ్యూనిస్టులూ, చైనా ప్రభుత్వమూ దేశంలో మైనారిటీ జాతుల సమస్యను ఎదుర్కొంటూవున్నది. మేమీ సమస్య విషయంలో అతిజాగ్రత్తగా వ్యవహరించాము. ఈ వివిధ మైనారిటీ జాతులలోనూ వారినుండే కాడర్లను 10 ఏండ్లగా తర్ఫీదుచేస్తూ వచ్చాము. హాన్ జాతి దురహంకారానికి వ్యతిరేకంగా హాన్ జాతి ప్రజలలోనే, ముఖ్యంగా హాన్ జాతి కాడరులోనూ, కమ్యూనిస్టు పార్టీలోని హాన్ జాతి సభ్యులలోనూ, ప్రజా విమోచన సైన్యంలోని హాన్‌జాతి అధికారులూ, సామాన్య సైనికులలోనూ తీవ్రమైన ప్రచారాన్ని సాగించాము. పెట్టుబడిదారీ ప్రపంచంలో కనివిని ఎరుగని పద్ధతిని మేము చేబట్టాము. వివిధ జాతులు నివసించే ప్రాంతాలలో హాన్ ప్రజలు అధిక సంఖ్యాకులుగా వున్న సందర్భాలలో మైనారిటీ జాతుల స్వపరిపాలిత పరగణాలను ఏర్పర్చటానికి హాన్ జాతి ప్రజలను ఒప్పించాము. ఈ విధంగా లోపలి మంగోలియా స్వపరిపాలన పరగణా, క్వాంగ్సీ చుయాంగ్ జాతీయ స్వపరిపాలన పరగణా, నింగ్సియా

హూాయ్ జాతీయ స్వపరిపాలన పరగణా, స్వపరిపాలన ప్రాంతాలూ, జిల్లాలూ ఈ విధంగానే ఏర్పడ్డాయి. టిబెట్టులో ఉన్నత శ్రేణికి చెందినవారందరి యొక్క సహకారాన్ని సంపాదిస్తానికి మేము ఎంతో ఓర్పునూ, సహనాన్నీ ప్రదర్శించాము. టిబెట్టును శాంతియుతంగా విముక్తి పొందించిన 8 ఏండ్లు మేము పూర్వపు టిబెట్టు స్థానిక ప్రభుత్వాన్నీ. దాని మొత్తం వ్యవస్థనూ, దాని సైన్యాన్నీ, చివరకు దాని కరెన్సీని కూడా యథాతథంగా అట్టేబెట్టి వుంచాము; తాము అత్యవసరంగా కోరే సంస్కరణలను కూడా ప్రస్తుతానికి అమలు జరపవద్దని టిబెట్టు ప్రజలకు నచ్చచెప్పాము. చైనా ప్రజా ప్రభుత్వం పూర్వపు టిబెట్టు స్థానిక ప్రభుత్వానికి స్వపరిపాలన హక్కు యివ్వలేదని దలైలామా చేసినదని చెప్పబడే ప్రకటనలో ఒక ఆరోపణ చేయబడింది. ఆ ఆరోపణే గనుక నిజమైతే, దేశద్రోహులుగా రుజువైన అభివృద్ధినిరోధకులు ఏనాడో అరెస్ట్ చేయబడి శిక్షింపబడి వుండేవారు; టిబెట్టులో ప్రజాస్వామిక సంస్కరణలు ఈ నాటివరకూ వాయిదా వేయబడివుండేవి కావు; అభివృద్ధినిరోధకుల యెడ చైనా ప్రజా ప్రభుత్వం మిక్కిలి ఉదారమైన వైఖరిని అవలంబించింది. లాసాలో తిరుగుబాటు ప్రారంభమైన తర్వాత కూడా, లాసానుండి దలైలామా లేవదీసుకు పోబడ్డాడన్న విషయం తెలిసిన తర్వాత కూడా చైనా ప్రజావిమోచన సైన్యంయొక్క టిబెట్టు మిలటరీ ఏరియా కమాండు తిరుగు దాడికి పూనుకోలేదు. తిరుగుబాటుదార్లు మిలటరీ ఏరియా కమాండు ప్రధాన కార్యాలయంపై దాడిచేసిన 7 గంటల తర్వాతనే అట్టి ఎదురుదాడికి పూనుకోవడం జరిగింది. ఆసమయానికి శాంతియుత పరిష్కారానికి వున్న అన్ని మార్గాలనూ ఈ అభివృద్ధినిరోధకులు మూసివేసారన్న విషయం స్పష్టం. ఇక మిగిలిన మార్గమల్లా ఒక్కటే; శాంతి భద్రతల కాపాడటానికై సైనిక చర్యను తీసుకొని తిరుగుబాటు అణచివేయటమే వున్న ఆ ఒక్కమార్గం. లాసా ప్రాంతంలో తిరుగుబాటును అతిత్వరగా అణచివేయగల బలం ప్రజా విమోచన సైన్యానికి వున్నది కాబట్టి, అదే మొదటి ఎత్తువేయదలచుకొంటే నిస్సందేహంగా అది నోర్బు లింకా రాజప్రసాదాల్ని తగిన సమయంలో చుట్టివేసి, తిరుగుబాటుదార్లు దలైలామాను లేవదీసుకుపోవటాన్ని అరికట్టగల్గి వుండేది. వివేకమున్న ఎవరైనా ఒక్క నిముషం ఆలోచిస్తే ఈ విషయాన్ని గ్రహించి రాజప్రసాదం దిక్కుగా రెండు మూడు ఫిరంగిగుండ్లు పేల్చబడ్డాయనీ, అవి దగ్గరలో వున్న కొలనులో పడ్డాయని చెప్పే కట్టుకథలలో సత్యం ఎంతమాత్రం లేదని ఇట్టే గ్రహించగలరు. ఇటువంటి అతితీవ్ర పరిస్థితులలో కూడా మొదటి దెబ్బను తాము కొట్టకూడదనే పంథాను మొదటినుండీ చైనా ప్రజా ప్రభుత్వమూ, ప్రజావిముక్తి సైన్యమూ అనుసరిస్తూ, దానికి కట్టుబడి వుండటంద్వారా కమ్యూనిస్టులు జాతుల సమస్యయెడ అతిజాగ్రత్తగా వ్యవహరిస్తూవచ్చారనీ, ముఖ్యంగా, టిబెట్టులోని

ఉన్నత వర్గాలవారిని తమవైపుకు తిప్పుకొంటానికై అత్యధికమైన ప్రయత్నాలు చేశారనీ తెలుస్తుంది. ఇటువంటి పంథాను విప్లవ శ్రామిక వర్గమొక్కటే అనుసరించగల్గుతుంది. బూర్జువావర్గంగాని, ఇతర దోపిడి వర్గాలుగాని ఇటువంటి పంథాను అనుసరించాలన్నా అవి అనుసరించలేవు.

జాతుల మధ్య సంబంధాలలో యిప్పటికీ కూడా ప్రప్రధానమైన కీలకం వర్గ పరిశీలన. మేము "వారిని స్నేహపూర్వకంగా సహకరించే విధంగా తిప్పుకుంటాము" అని శ్రీ నెహ్రూ ఆశిస్తారు. మేము యిటువంటి పద్ధతిని లోగడ అవలంబించలేదనీ, యిప్పటికీ అవలంబింటంలేదనీ యిది మామీద వేయబడే పరోక్షపు ఆరోపణ అయినప్పటికీ శ్రీ నెహ్రూ యొక్క యీ ఉద్దేశం సందేహం లేకుండా మంచిదే. వాస్తవానికి విప్లవ శ్రామికవర్గమే చారిత్రక జాతుల సమస్యకు సరైనటువంటీ, పరిపూర్ణమైనటువంటీ పరిష్కారమార్గాన్ని చూపగల్గుతుంది. జాతుల మధ్య తగాదాలూ, అడ్డుగోడలూ కల్పించబడినది ప్రధానంగా దోపిడీ వర్గాలచే; ఆ వర్గాలు వాటి నెన్నడూ పరిష్కరించలేవు. కాని విప్లవ శ్రామికవర్గం యొక్క సరైన నాయకత్వం క్రింద వివిధ జాతులలోనూ వున్న కార్మిక ప్రజాసామాన్యం కొన్ని చర్యలు తీసుకోవటంద్వారా, చరిత్రలో అపరిష్కృతంగా నిల్చిపోయిన యీ అన్ని తగాదాలనూ, అడ్డుగోడలనూ తొలగించటమూ, సుహృద్భావపూరితమైన సంబంధాలను ఏర్పర్చుకోవటమూ పూర్తిగా సాధ్యమే. చైనా చరిత్రలో చిరకాలంగా జాతుల పీడన, జాతుల మధ్య వైషమ్యాలూ వుంటూనే వచ్చాయి. మంగోలియాను మంచూరియన్ పరిపాలకులు హాన్, ఉయిఘర్, టిబెట్టు జాతుల ప్రజలను ఒకప్పుడు అణచిపెట్టారు. హాన్ జాతి పరిపాలకులు కూడా మంగోలు, మంచూ, ఉయిఘర్, టిబెట్టు జాతుల ప్రజలను అణచిపెట్టి వుంచారు. శ్రామికవర్గంచే నడవబడే చైనా ప్రజా రిపబ్లికు ఏర్పడిన తర్వాత యీ పరిస్థితులలో తీవ్రమైన మార్పు వచ్చింది. జనాభాలో అత్యధిక సంఖ్యాకులుగా వుంటూ, ప్రధాన విప్లవశక్తిగా వున్న హాన్ ప్రజలు యీనాటికి కూడా లోపలి మంగోలియా, సింకియాంగ్. టిబెట్టులకు ఉద్యోగి బృందాన్ని పంపవలసి వున్నది; కాని వారు అక్కడికి వెళ్ళేది అక్కడి మైనారిటీ జాతులను అణచిపెట్టి దోచుకొంటానికి కాదు; స్థానిక జాతులనుండి వచ్చే విప్లవ కార్యకర్తలతో కలిసి స్థానిక శ్రామిక ప్రజలు తమ జాతిలోనే వున్న దోపిడిగాండ్రకూ, నిరంకుశ పరిపాలకులకూ వ్యతిరేకంగా పోరాడి వారినుండి స్వాతంత్ర్యాన్నీ, విముక్తినీ సంపాదించుటకూ తోడ్పడటానికీ; ప్రజాతంత్రాన్నీ, సోషలిజాన్ని సాధిస్తానికే అనగా ఈ మైనారిటీ జాతుల ఆర్థిక వ్యవస్థా, సంస్కృతీ వికసించటానికి గల పునాదులు వేస్తానికిగాను వారు అక్కడికి వెళ్లేది. ఆ ప్రాంతాలలో పనిజేసే హాన్ జాతికి చెందిన కమ్యూనిస్టు సభ్యులు, ప్రజా

విమోచన సైన్యంయొక్క హాన్ అధికారులూ, సైనికులూకూడా ఆ మైనారిటీ జాతి ప్రజల వీపులపై సవారి చేయటానికి గాక వారిపై పెత్తనం చేయటానికిగాక అందుకు విరుద్ధంగా ఆ స్థానికజాతులలోవున్న విప్లవ కార్యకర్తలతో కలిసి పని జేస్తానికీ, మైనారిటీజాతి ప్రజలకు సేవకులుగా పని చేస్తానికి వెళ్ళారు. మైనారిటీజాతి ప్రజలు సుఖదుఃఖాలలో పాలుపంచుకొంటూ ఎటువంటి కష్టాలూ, ప్రమాదాలూ వచ్చినా లెక్కజేయకుండా ఈ మైనారిటీ జాతి ప్రజల హక్కుల కొరకూ, సౌఖ్యాలకొరకూ పోరాడుతూ వున్నారు. ఈ విధంగా మైనారిటీ జాతులకు చెందిన శ్రామిక ప్రజలూ, దేశ భక్తిపూరితులై, సంస్కరణలను కోరే ఉన్నత వర్గ ప్రజలూ, మధ్య తరగతి ప్రజలూ హాన్ జాతి శ్రామిక ప్రజలతో కలిసి. హాన్ ప్రజలు చేసినట్లుగానే తమ మైనారిటీ జాతులలోనే వుండే ఉన్నత వర్గాల అభివృద్ధినిరోధకుల పరిపాలనను కూలద్రోశారు. ఈ విధంగా జాతుల మధ్య తగాయిదాలూ, అడ్డుగోడలూ కల్పించే కారణాలను తొలగించటం జరిగింది; వివిధ జాతుల మధ్య స్నేహ సంబంధాలను నిజమైన గట్టి పునాదులపై నిర్మించటం జరిగింది. లోపలి మంగోలియా. సింకియాంగ్, వాయువ్య మూలవున్న నింగ్సియా. కాన్సు, ఛింగయ్, ఆగ్నేయ మూలనవున్న క్వాంగ్సి షెజువాన్. క్వీఛౌ, యున్నాన్‌లలోనూ యిద్దే పరిణామక్రమం జరిగింది. ఈ పరిణామక్రమంలో సంస్కరణలకు నాయకత్వం వహించే కార్యకర్తలు మైనారిటీ జాతులలో సంస్కరణలను కోరుతూవుండే వివిధ శ్రేణుల ప్రజలతోనూ కలిసి సన్నిహితంగా వుంటానికి పూర్తి కృషిజేస్తూ, సంస్కరణలు జరగక ముందూ, జరిగే కాలంలోనూ, జరిగిన తర్వాతకూడా వారితో పూర్తి సంబంధాలు పెట్టుకొని వుంటారు. పోరాటాలు లేకుండా చేయటం అసంభవమన్నమాట నిజమే; షెజువన్, కాన్సు. ఛింగైలలో టిబెటన్లు నివసించే ప్రాంతాలలో సాయుధ తిరుగు బాట్లు జరుగుతూవచ్చాయి. కాని, మేము లోగడ చెప్పినట్లుగా, టిబెటన్లు నివసించే యీ ప్రాంతాలలో జరిగిన తిరుగుబాట్లు టిబెట్టులోవున్న అభివృద్ధి నిరోధకులు. తమకున్న ప్రత్యేక స్థానమును అవకాశంగా తీసుకొని, ప్రోత్సహించి, నడిపితే సాగిన తిరుగుబాట్లే.

శాంతియుత విమోచన కాలంలో టిబెట్టులో, ఈ పెద్ద దాసయజమానుల పరిపాలన మార్చబడలేదు. కాబట్టి వీరు తమకు ఆవిధంగా లభించిన లిగల్ అవకాశాన్ని వినియోగించుకొని టిబెట్టుసైన్యాన్నీ. ఖాంబా తిరుగుబాటుదార్లనీ, దాస్యవిధానాన్ని బలపర్చే ఇతర అభివృద్ధి నిరోధక రాజకీయ సంస్థలనూ నడప టానికీ, చైనా వ్యవహారాలలో జోక్యం కల్గించుకోజూచే విదేశీయులతో చేతులు కలపటానికి పూనుకొన్నారు. ఈ కారణంవల్లనే సంస్కరణలు అమలు జరపడం లేదు. సరీగ్గా ఈ కారణంవల్లనే వారు తిరుగుబాటును లేవదీస్తానికి కూడా వీలు

ఇవన్నీ జరిగినప్పటికీ, టిబెట్టులో ప్రజా విమోచన సైన్యం ప్రవేశించినప్పటినుంచీ టిబెట్టు ప్రజలు ఎంతో ఆతురతతో అనేక పర్యాయాలు సంస్కరణల నమలుజరప మని కోరుతూవచ్చారు. చిరకాలంగా బాధలు పడుతూ వున్న టిబెట్టు ప్రజలకు సంస్కరణలంటే భయంలేదు. వీరి కున్న భయమల్లా చైనా కేంద్ర ప్రభుత్వం టిబెట్టులోని పెద్ద దాస యజమానులను సమాధానపర్చే వుద్దేశంతో ఏ ఏడాది కా ఏడాది సంస్కరణలను వాయిదా వేస్తుందనే. ప్రపంచమందలి జీవకారుణ్యవాదు లారా, టిబెట్టులోని దాసులు కూడా ప్రజలే నని గుర్తించండి. వీరిని నిత్యమూ బహు ఘోరంగా దోచుకుంటూ, చర్మాలు ఒలుస్తూ, కళ్లు తోడేస్తూవుండే రాక్షసు లను తమ రక్షకులుగా భావించమని వారికి నచ్చజెప్పటం అసాధ్యమైన పని. అదే విధంగా, తమతోబాటు పాటుపడుతూ, తమకు ఎంతో ఆప్యాయతతో సహాయపడుతూ, తమకు జబ్బులు వచ్చినప్పుడు వుపచర్యలు చేస్తూ, తమదగ్గర నుండి ఒక చిన్న సూదినిగాని, దారం ముక్కనుగాని తీసుకోనటువంటి ప్రజా విమోచన సైన్యంలోనివారు తమ శత్రువులని వారిచే నమ్మించటం కూడా అసాధ్య మైన పనే. తిరుగుబాటుదార్లు ఎన్ని జాతి, మత నినాదాలను పట్టుకొని వూరేగినా, ఎత్తైన కొండలూ, అగాధమైన లోయలూవుండే ప్రాంతమైనా, విదేశీయులనుండి అనేక రకాలైన సహాయాలను పొందినప్పటికీ ఈ తిరుగుబాటుకు టిబెట్టుప్రజల సహకారం ఈషణ్మాత్రముకూడా లేదంటేనూ కనురెప్పపాటులో అణచివేయ బడిందంటేనూ దానికి మూలకారణం పైనజెప్పినదే. తిరుగుబాటును అణచివేసే సందర్భంలో ప్రజావిమోచనసైన్యం, ఫ్యూడల్ ప్రభుత్వంయొక్క రాజముద్రిక లనూ, తిరుగుబాటుదార్ల ఆయుధాలనూ, చిత్రహింసలకు సాధనాలైన న్యాయ స్థానాల కొరడాలనూ జప్తుచేసుకొన్నది. దీర్ఘ అనావృష్టి తర్వాతపడ్డ వడగళ్ళ వానకు సంతోషించినట్లుగా ప్రతిచోటా టిబెట్టు ప్రజలు ఈ జప్తులకు హర్షించారు. ఈ మూడింటివల్లా ప్రజలు ఎంతకాలంగా అణచబడ్డారో! ప్రజావిమోచన సైన్యా నికి దారిచూపటానికీ, బందిపోట్లను పట్టిస్తానికి వేగులుగా పనిచేస్తానికీ తిరుగు బాటుదార్లలో హతశేషులనూ, వారి ఆయుధాలనూ పట్టిస్తానికీ, స్వచ్ఛందంగా టిబెట్టు ప్రజలు తోడ్పడ్డారు. ప్రజలుపట్టుకొని లాసాలోని ప్రజాన్యాయస్థానానికి సమర్పిం చిన రైఫిళ్ళే వందలకొలదిగా వున్నాయి. లోకాప్రాంతంలోని అనేకగ్రామాలలో ప్రజావిమోచనసైన్యం సమీపిస్తున్నదని తెలియగానే ప్రజలు ఎదురేగి హాలూ (ప్రేమతో ఇచ్చే వుత్తరీయాలు), ఎఱ్ఱటిపూవులూ, పిల్లనగ్రోవులూ సమర్పించే వారు. దీనితోబాటుగానే తిరుగుబాటుదార్లు తమకుజేసిన మానభంగాలూ, దోపిడీలు, హత్యలూ, గృహదహనాలూ మున్నగువాటినిగూర్చి తెలియజేసి, వీటికి ప్రతీకారం తీర్చుకోమని హెచ్చరించేవారు. కుంగ్‌కే - సాగ్‌వద్ద ప్రజావిమోచనసైన్యం ముందుకు తోసుకురాకుండా వుండగలందులకై తిరుగుబాటుదార్లు రోడ్డుకు

అడ్డంగా నాలుగు కందకాలు తవ్వారు. కాని తిరుగుబాటుదార్లు పోగానే స్థానిక ప్రజలు ఆ కందకాలను పూడ్చివేశారు. లింజ్జేగ్రామానికి ప్రజావిమోచన సైన్యం చేరుకొన్నపుడు, వారి మందుగుండు సామానునూ, భోజన సామగ్రినీ మోసుకు పోవటానికై స్థానికప్రజలు వెనువెంటనే వాహనాలను ఏర్పాటుచేశారు. తిరుగుబాటుదార్లతో మిగిలినవారిని పరిమార్చుతూ సైన్యం ముందుకు పోతూవుంటే ప్రజలు వారితోకూడా ముందుకు సాగిపోతూ వచ్చారు. ఇటువంటి ఉత్సాహభరితమైన ఉదాహరణలు అసంఖ్యాకంగా వున్నాయి. తిరుగుబాటు పూర్తిగా అణచివేయబడ్డతర్వాత మామూలు పరిస్థితులను నెలకొల్పటానికై ప్రజాబాహుళ్యం ప్రజాప్రభుత్వానికి తోడ్పడి, ఈ ప్రజాప్రభుత్వం సహాయంతో వుత్పత్తి కార్యక్రమంలోకి వెనువెంటనే వెళ్ళిపోయారు. తిరుగుబాటుదార్ల అఘాయిత్యాల మూలకంగా లోకాప్రాంతంలో ఒక పక్షంరోజులు వెనుకబడిన వసంతకాలపు సాగులు ప్రజావిమోచనసైన్యం సహాయంతో త్వరగా పూర్తిచేయబడ్డాయి. అక్కడ యిప్పుడు విస్తారమైన ప్రజాబాహుళ్యం పొలాలకు ఎరువులు తోలటంలోనూ, విత్తనాలు చల్లటంలోనూ, బోదెలు, పంటకాల్వలనూ మరమ్మతులు చేయటంలోనూ పూర్తిగా నిమగ్నులై వున్నారు. ఎంతోకాలంగా మూగవోయిన గళాలను విప్పి ఆనంద గీతాలను పాడుకొంటున్నారు. ఎప్పుడు భూమి పంచిపెట్టబడుతుందని అన్నిచోట్లా రైతులు అడుగుతున్నారు. గతంలో ముఖ్య తిరుగుబాటుదార్లకు చెందిన భూమిని ఎవరైతే సాగుజేస్తూ వున్నారో వారే ఆ భూములలోని పంటనంతటినీ ఈ ఏడాది తీసుకోవచ్చునని ప్రకటించగానే దలైలామాను ఎత్తుకు పోవటంలో ముఖ్యపాత్రను వహించిన వారిలో ఒకడగు దాసయజమాని సుర్కాంగ్ వాంగ్‌చింగ్ - గాపై యొక్క దాసులందరూ కాయ్‌ఘుచికాలో తమంతటతామే ఉన్న మనుష్యబలగాన్ని అంతటినీ సమీకరించి పరస్పర సహాయపు జట్టులను ఏర్పర్చి, విరగపండే పంటలను పండిస్తానికిగాను యావత్తు భూమినీ సాగులోకి తెస్తానికి పూనుకొన్నారు. తమ కాళ్ళమీద తాము నిలబడి తమ గడ్డకు తామే యజమానులయ్యేకాలం అతిసమీపంలోనే వున్నదని టిబెట్టు రైతాంగం ధీమాతో వున్నట్లు ఇందువల్ల స్పష్టం.

ఈ విషయాలను కొంచెం దీర్ఘంగా తడిమినందుకు మమ్మల్ని క్షమించవేడుతున్నాం... టిబెట్టు శ్రేయస్సును కోరే వారందరూ, చియాంగ్ వంశం సైన్యాలు టిబెట్టులో ప్రవేశించిననాటినుండీ ఆ పూర్వకాలపు చైనా సైన్యాలకు ఎటువంటి ఆహ్వానాలు లభించేవో, ఇప్పటి ప్రజావిమోచన సైన్యానికి టిబెట్టు ప్రజలిచ్చే ఆహ్వానం ఎటువంటిదో కాస్త గమనించవలసినదిగా కోరుచున్నాము. ఈ ప్రస్తుత ఆహ్వానానికీ, ఇండియానుండి వచ్చిన బ్రిటిషు దురాక్రమణ సైన్యాలు లాసాపై విరగబడి దాడిచేసినప్పుడు టిబెట్టు ప్రజావ్యతిరేకతకూ పోల్చిచూసి

నప్పుడు ఎంత తేడావున్నదో అర్థంకాగలదు అందువల్ల. టిబెట్టు ప్రజలతో కలిసి ప్రజావిమోచన సైన్యం హత్యలనూ, గృహదహనాలనూ సాగించే తిరుగుబాటు దార్లను అణచివేస్తానికి తీసుకొన్న న్యాయమైన చర్యలను ఏవిధంగా జాతిపీడన అనీ, దురాక్రమణ అనీ అనగలరు ?

హాన్, టిబెటన్ సమాజాలమధ్య సమన్వయం కుదర్చటం దాదాపు అసాధ్యమనీ, ఉభయుఃమధ్యవున్న మానసిక భావోద్రేకపు అడ్డుగోడలను తొలగించటానికి ప్రయత్నాలు చేయబడలేదనీ, చేయబడినా అవి జయప్రదం కాలేదనీ శ్రీ నెహ్రూ చెప్పుతున్నారు. టిబెట్టు శ్రామికప్రజలకు సంబంధించినంతవరకూ వాస్తవఘటనలే ఈ ప్రశ్నకు సమాధానాన్ని యిచ్చాయి. భవిష్యత్తులో యింకా స్పష్టమైన, సూటియైన సమాధానాన్ని యిస్తాయి. ఇక ఉన్నతశ్రేణులకు సంబంధించిన ప్రజలలో చాలామందికి ఈ మానసిక భావోద్రేకపు ఆటంకాలు వివిధ మోతాదులలో మారటం జరిగింది. తాను నిర్బంధంలో వున్నప్పుడు రహస్యంగానూ, స్వచ్ఛందంగానూ దలైలామా జనరల్ టాన్-కున్‌సాన్‌కు వ్రాసిన మూడు లేఖలూ, పంచన్‌ఎర్దెని, న్గాపో న్గావాంగ్ జిగ్మి, షిరాబ్ జాల్ట్సో, న్గావాంగ్ జాల్ట్సో, లోజాంగ్ త్సేవాంగ్‌లు నేషనల్ పీపుల్సు కాంగ్రెసులో చేసిన వుపన్యాసాలూ ఈ విషయాన్ని రుజువుచేసే కొన్ని వుదాహరణలు. టిబెట్టు ఉన్నత, మధ్యతరగతి శ్రేణులలోకి చాలామంది దేశభక్తిపూరితులైనవారు టిబెట్టు స్వపరిపాలనా ప్రాంతంయొక్క సన్నాహసమితిపక్షాన నిల్చివున్నారు. కాబట్టి ఈ తిరుగుబాటును జాతీయ "విప్లవం"గానూ తిరుగుబాటు నణచివేయడాన్ని జాతీయ "విషాదగాథ" గానూ చిత్రించటానికి ఎక్కడా ఆధారంలేదని స్పష్టపడుతోంది. లాసాలోని ప్రాథమిక పాఠశాలలలోనూ, మధ్యమ పాఠశాలల్లోనూ చదివేవారిలో ఉన్నత శ్రేణుల కుటుంబాలకు చెందినవారు చాలామంది వున్నారు. తిరుగుబాటు అణచివేయబడగానే వారందరూ తిరిగి తమ తమ క్లాసులకు యథాప్రకారం వెళ్ళుతూ వుండడమేగాక, అట్టివారిసంఖ్య వెనుకటికంటెకూడా ఎక్కువగా పెరిగింది.

చైనాయెడ ద్వేషభావంలేని కొందరు భారతీయ మిత్రులు, చాలాకాలంగా జరిగే పత్రికా ప్రచారం ప్రభావానికి లోనయీ, టిబెట్టు సమాజంలోవున్న వాస్తవిక జీవన పరిస్థితులనూ, ప్రజా విమోచన సైన్యంయొక్క కార్యకలాపాలనూ స్వయంగా కళ్ళారాచూసి వుండకపోవటంచేతనూ, వారి పత్రికలు చైనాకు సంబంధించిన భోగట్టానుపూర్తిగాప్రచురించడం అరుదుకావటంవల్లనూ,కొంతకాలంపాటు చైనాయొక్క వైఖరినీ, పంథానూ తప్పుగా అర్థంచేసుకోవటం తటస్థించింది. అయినప్పటికీ వాగ్ధాటికంటె యదార్థఘటనలే సుబోధకమౌతాయి. చివరకు సత్యమే నిలబడుతుంది. ప్రస్తుతం కొన్ని అపోహలను కల్గివుంటూ, మేము చెప్పేవాటిని విశ్వసించేందుకు యింకా వెనుకాడుతూవుండే మా భారతీయమిత్రులు

చివరకు సరియైన నిర్ణయాలకే వస్తారని మాకు పూర్తిగా నమ్మకమున్నది. అట్టి వారిలో శ్రీ నెహ్రూకూడా వుంటారని మా విశ్వాసం. శ్రీ నెహ్రూకు అఖండ ఆత్మవిశ్వాసం వున్నదనీ, టిబెట్టు సమస్యపై ఆయనకు ఒకరకమైన స్వతంత్ర భావాలు వున్నవనీ మాకు తెలుసు. పూర్వపు టిబెట్టు స్థానిక ప్రభుత్వంలోవున్న అతి బలీయమైనముఠా గొఱ్ఱెపిల్లలకంటె సాధువులని ఆయన భావిస్తున్నాడు. కాబట్టి వారు మాపై దాడిచేసిన తర్వాతకూడా మాదేతప్పుఅని వారు అనుకొంటు న్నారు. మేముచూసిన విధంగానే ఈ దృశ్యాన్ని మా విదేశీమిత్రులుకూడా చూడా లని మేము కోరలేము; తన తాత్విక, చారిత్రక, రాజకీయ దృక్పథాలనుకూడా మార్చుకోమని మేము శ్రీ నెహ్రూను అసలే కోరలేము. కాని శ్రీ నెహ్రూ ఆలో చనా విధానంలో స్పష్టంగా వైరుధ్యా లున్నాయి. అయితే ఈ వైరుధ్యాల నే విధంగా పరిహరించాలనే విషయాన్ని మేమిక్కడ చర్చించబూనటంలేదు. అటు వంటి విషయాలపై స్నేహపూర్వకమైన చర్చలను సాగించనూవచ్చును. లేదా అసలు చర్చించకుండానే వుండవచ్చును. మన ఉభయులకూ కావలసినన్ని స్వంత పనులు వున్నవి. మన స్వంతపనులను చక్కబెట్టుకోవటంలో మనం నిమగ్ను లమై వున్నాము. అటువంటప్పుడు ఒకరి వ్యవహారాలలో మరొకరు వేలుపెట్టటం ఎందుకు ? "ఒకదేశం అభిప్రాయాలను మరొక దేశంపై రుద్దబూనటంవల్లగాని, ఒక ప్రజయొక్క జీవన పద్ధతిని మరొక ప్రజకు అంటగట్టబూనటంగాని తప్పని సరిగా సంఘర్షణకు దారితీసి, శాంతిని విఘ్నంచేస్తుంది" అని పెకింగ్‌లో వున్న ప్పుడు శ్రీ నెహ్రూ చెప్పారు. అది చాలా సమంజసమైన అభిప్రాయం. కాని దురదృష్టవశాత్తు, శ్రీ నెహ్రూతోసహా కొంతమంది భారతీయ బృందం, వారి అభిప్రాయాలకు అనుగుణ్యంగా మేము నడుచుకోవాలని కోరుతూవున్నారు. మనం ఉభయులమూ ఇరుగుపొరుగువారం; చక్కటి స్నేహితులం. ఉభయులమూ ఎవరిపద్ధతిలోవారు శాంతంగా జీవితయాత్రను గడపవచ్చు. మీ రనుసరించే విధా నాలవల్ల ఇండియాలో మీరు మంచి ఫలితాలను పొందితే మీనుండి మేము నేర్చు కొనటానికి వ్యవధిలేకపోలేదు. అటువంటప్పుడు, మనమైత్రికి భంగం కల్గించే టట్లుగా మా వ్యవహారాలలో జోక్యం కల్గించుకొనే కొన్ని చర్యలను తీసుకొంటా నికి ఏమీ బిడియపడకుండా ఎందుకింత తొందరపడడం ? మేము ఎంతో దీర్ఘంగా ఆలోచించాముకాని ఈ విషయాన్ని మేము యిప్పటికీ అర్థంచేసుకోలేక పోతు న్నాము.

టిబెట్టు వ్యవహారాలలో ఇండియా జోక్యం కల్గచేసుకోవటాన్ని ప్రధాని నెహ్రూ లేదంటున్నారు. "టిబెట్టునుగూర్చి రాజకీయమైనటువంటి లేక దురుద్దేశ పూరితమైనటువంటి ఆశలు" ఇండియాకు ఎన్నడూలేవని రుజువుచేస్తానికై వారు భారతదేశం స్వతంత్రంపొంది విభాగమవటానికి ముందూ, వెనుకాగల చారిత్రక

ఘటనలన్నిటినీ పేర్కొన్నారు. టిబెట్టును తన రాజ్యంలో కల్పివేసుకొనే వుద్దేశంగాని, లేదా టిబెట్టు వ్యవహారాలలో జోక్యం కల్గచేసుకొంటానికి తన సైన్యాలను పంపే ఉద్దేశంగాని ఇండియాప్రభుత్వానికి లేదనే అర్థంలో శ్రీ నెహ్రూ యొక్క రిమార్కులు యథార్థమని మేము భావిస్తున్నాము. టిబెట్టును చైనాయొక్క అంతర్భాగంగానే భారతదేశం ఎల్లప్పుడూ గుర్తిస్తూవచ్చింది. టిబెట్టుపై చైనా సార్వభౌమత్వాన్ని కల్గివున్నదనికూడా భారతదేశం ఎల్లప్పుడూ గుర్తిస్తూనేవున్నది. పంచశీలకు అనుగుణ్యంగా చైనాలోని టిబెట్టు పరగణాకూ, ఇండియాకూ మధ్య వ్యాపారం, రాకపోకలనుగూర్చినఒకఒడంబడికను1954ఏప్రిల్‌లో ఇండియా చైనాతో కుదుర్చుకున్నది. అటుతర్వాత టిబెట్టునుండి తన సైన్యాలను వుపసంహరించు కొని పోస్టు, టెలిగ్రాఫ్ పరికరాలనుకూడా చైనాకు స్వాధీనం చేసింది. చైనా ప్రజలు వీటికి సంతృప్తిని ప్రకటించారు. అయినప్పటికీ ఒకదేశం వ్యవహారాలలో మరొకదేశం జోక్యం కల్గించుకోవడం అనేకరీతులలో జరుగుతుంది. ఇండియా ప్రభుత్వం పూర్వంగానీ, ప్రస్తుతకాలంలోగానీ ఎన్నడూ చైనా భూభాగమైన టిబెట్టులో ఏవిధంగానూ జోక్యం కల్గించుకోలేదంటే నమ్మవీలుకాకుండావున్నది.

టిబెట్టులో ప్రవేశించమని తన సైన్యాలకు చైనా ప్రభుత్వం ఆదేశం పంపినప్పుడు, 1956 అక్టోబరులో ఇండియాప్రభుత్వం తన దౌత్యవర్గాలద్వారా జోక్యం కల్గజేసుకొన్న విషయాన్ని మా పత్రిక ఇదివరకే ప్రకటించిన విషయాన్ని గుర్తు చేస్తున్నాము. చైనాప్రభుత్వం తన సైన్యాలను టిబెట్టులో ప్రవేశించమని ఆదేశమిచ్చే తరుణంలోనే టిబెట్టు స్థానిక ప్రభుత్వాన్ని సంప్రదింపుల కొరకై ప్రతినిధులను పెకింగుకు పంపవలసినదిగా కోరడమైనది. చైనా సార్వభౌమత్వానికి సంబంధించి ఇవి పూర్తిగా అంతరంగిక విధానం. అయినప్పటికీ, "చైనాసైన్యాలు టిబెట్టుపై దాడిచేయటం శోచనీయంతప్ప మరేమీకాదు" అనీ, ఈదాడి "ఏవిధంగానూ సమర్థనీయంకాదు" అనీ, ఈ దాడిని మిక్కిలి ఆశ్చర్యకరమైనదిగానూ, విషాదకరమైనదిగానూ" ఇండియాప్రభుత్వం భావిస్తున్నదనీ 1956 అక్టోబరు 21 అక్టోబరు 28, నవంబరు 1 వ తేదీలలో మూడు సందేశ పత్రాలను ఇండియాప్రభుత్వం చైనా ప్రభుత్వానికి అందజేసింది. ఈ సందేశ పత్రాలలో తన భూభాగమే అయినట్టి టిబెట్టులోకి చైనాసైన్యాలు ప్రవేశించటం మూలకంగా "అంతర్జాతీయ పరిస్థితులు అతివిషమమైనట్టి, సున్నితమైనట్టి ఘట్టంలోవున్న ఈ తరుణంలో చైనాకు విహితులుగావున్న దేశాలు చైనావ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించేందుకు అవకాశం కల్గుతోంది" అనీ, "మిత్రరాజ్యసమితిలో చైనాకు పునఃప్రవేశం కల్పించే సమస్య విషయంలో చాలా తీవ్రపరిణామాలకు దారితీస్తుంది" అనీ, "మిత్రరాజ్య సమితిలోనూ, భద్రతాసమితిలోనూ చైనా ప్రజాప్రభుత్వానికి ప్రవేశం కల్పించేందుకు అడుపడేవారికి మిక్కిలి బలాన్ని చేకూర్చినట్లు అవుతుంది" అనీ, "చైనాయొక్క

స్థానాన్ని గూర్చి ప్రపంచం తప్పుడు అవగాహన చేసుకొంటుంది" అనీ, చైనా ప్రజాప్రభుత్వానికీ, టిబెట్టు స్థానిక ప్రభుత్వానికీ మధ్య జరిగే "శాంతియుత సంప్రదింపులకూ, దీనికీ ఎక్కడా పొత్తుకుదరడంలేదు" అనీ, "చైనాయొక్క ప్రయోజనాలకుగాని, శాంతిప్రయోజనాలకుగాని తోడ్పడజాలదు" అనీ, ప్రపంచంలో ఏర్పడిన ఉద్రిక్త వాతావరణాన్ని మరింత తీవ్రతరంజేసి యుద్ధప్రమాదాన్ని మరింత హెచ్చించింది" అనీ, ఇండియా-చైనాలమధ్య "స్నేహసంబంధాలకూ ప్రపంచ శాంతి ప్రయోజనాలకూ విఘాతం కల్గించింది" అనీ ఆరోపణలు చేయడం జరిగింది. ఇందుకు జవాబుగా ఇండియా ప్రభుత్వానికి చైనా ప్రభుత్వంపంపిన సందేశ పత్రంలో, టిబెట్టులో ప్రవేశించటమనేది దేశంయొక్క సార్వభౌమ హక్కులను ప్రజావిమోచనసైన్యం వినియోగించటం మాత్రమేననీ, టిబెట్టు సమస్య చైనా అంతరంగిక సమస్య అనీ, విదేశీయుల జోక్యాన్ని చైనా సహించదనీ చెప్పటం జరిగింది. దీనికీ, మిత్రరాజ్యసమితిలో చైనా ప్రాతినిధ్యం పొందే హక్కుకూ సంబంధమేలేదు. చైనాకు విహితులుగా వుండేదేశాలు మిత్రరాజ్య సమితిలో చైనాకు ప్రాతినిధ్యం కల్గించేసమస్యను అవకాశంగా తీసుకుని చైనా తన భూభాగంపై తన సౌర్వభౌమాధికారాలను వినియోగించరాదని బెదిరిస్తానికి పూనుకుంటే ఆ దేశాలు చైనాయెడ కనబర్చే శత్రుభావం మాత్రమే మరొక్కసారి రుజువు అవుతుంది. తన ఈ నిర్దిష్టమైన వైఖరిని నిక్కర్షగా పదేపదే చైనా ప్రభుత్వం చెప్పిన తర్వాతనే మరీముఖ్యంగా టిబెట్టులోకి ప్రజావిమోచన సైన్యాలు రాకుండా అరికట్టాలనే తలంపుతో ఛాంకో ప్రాంతంలో అడ్డునిల్చిన టిబెట్టు సైన్యం ప్రధాన భాగాన్ని పూర్తిగా ఓడించి పెద్ద విజయం పొందిన తర్వాతనే ఇండియాలో తలదాచుకొన్న టిబెట్టు స్థానిక ప్రభుత్వంయొక్క ప్రతినిధివర్గం సంప్రదింపులకై 1956 ఏప్రిల్ ఉత్తరార్ధంలో పెకింగుకు వచ్చింది. సంప్రదింపుల అనంతరం అదే సంవత్సరం మేనెలలో, టిబెటు శాంతియుత విమోచనకై 17 షరతులు గల ఒడింబడిక చేసుకోబడింది.

ఈచరిత్రనంతా తిరగదోడటం సంతోషకరమైనదేమీకాదు. అయినప్పటికీ వాస్తవిక విషయాలు వాస్తవికవిషయాలే. టిబెట్టు వ్యవహారాలలో ఇండియా ప్రభుత్వం ఎప్పుడూ జోక్యం చేసుకోలేదని ఎట్లా అనగలరు?

దురదృష్టవశాత్తూ, ఇటువంటిజోక్యం ఏదోఒక రూపంలో ఇప్పటికీ సాగుతూనేవున్నది. శాంతియుత సహజీవనం అనే పంచసూత్రాలప్రకారమే తమ ఉభయదేశాలమధ్యా వుండే సంబంధాలూ కొనసాగుతాయని చైనా, ఇండియా దేశాల ప్రభుత్వాలు సంయుక్తంగా ప్రకటన చేసినతర్వాతకూడా ఇటువంటి జోక్యం సాగటం మరీ విచారకరం. ఉదాహరణకు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూనే తీసుకొందాము. టిబెట్టులో తిరుగుబాటు ప్రారంభమైన తర్వాత ఆయనచేసిన ప్రక

టనలోనూ, రిమార్కులలోనూ స్నేహభావ ప్రకటనలు కొన్నివున్నా, శాంతియుత సహజీవనం అనే పంచసూత్రాలను అనుగుణ్యంగాలేని కొన్ని ప్రకటనలుకూడా వున్నాయని చెప్పకతప్పదు. ఉదాహరణకు "టిబెట్టు స్వపరిపాలన హోదాకు సంబంధించి చైనా టిబెట్టులు చేసుకున్న ఒప్పందం షరతులనుగాని, భారతదేశానికి యిచ్చిన హామీలకుగాని పెకింగు కట్టుబడి వుండలేదు. అక్కడ సైనిక ఆక్రమణ జరిగింది" (ఏప్రిల్ 13), "టిబెట్టుప్రజలు తమ స్వపరిపాలనను కాపాడుకొనగలరనీ, దానిని అనుభవించగలరనీ, ఇతరులవల్ల అణచబడరనీ, దోచుకోబడరనీ, నేను గాఢంగా ఆశిస్తున్నాను". [ఏప్రిల్ 14); అని వారు చెప్పారు. తన భూభాగంలోనే జరిగిన తిరుగుబాటును చైనా అణచివేస్తే, దానిని "సైనిక ఆక్రమణ" అనీ, వారి "స్వపరిపాలన"ను "అణచటం, దోచుకోవటం" అనీ చిత్రించటమూ, "ఇండియాకు యిచ్చిన హామీలకు కట్టుబడి వుండలేదు" అని చెప్పటమూ, ఇతరుల వ్యవహారాలలో జోక్యం కల్గచేసుకోవటం కాకపోతే మరేమిటి? దలైలామా తిరుగుబాటుదార్ల చేతులలో నిర్బంధంగా వుంచబడలేదనీ, తిరుగుబాటుదార్లకే ఆయన నాయకుడనీ ఇండియా ప్రభుత్వం నొక్కివక్కాణిస్తున్నది. ఇదే గనుక నిజమైతే, దలైలామాకు ఇండియాప్రభుత్వం ఘనస్వాగతాన్ని యివ్వటమూ, ప్రధాని నెహ్రూయే స్వయంగా ముస్సోరీకి వెళ్ళటమూ, ఇవన్నీ ఒక మిత్రదేశంలో తిరుగుబాటుకు నాయకత్వం వహించినదానికి స్వాగతం యివ్వటమూ, వారితో సంభాషణలు జరపటమూ కాదా? ఇండియా ప్రభుత్వపు అధినేతయే టిబెట్టువ్యవహారాలలో జోక్యం కూడదు అనే అసందిగ్ధమైన వైఖరిని తీసుకొనకపోవటంవల్లనే పరిపాలకపార్టీయైన కాంగ్రెసుకు అధ్యక్షురాలైన శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానకార్యదర్శియైన శ్రీమతి సుచేతా కృపలానీ టిబెట్టును ఒక "దేశం"గానూ, "స్వపరిపాలితదేశం"గానూ చిత్రించటమూ, కాంగ్రెసుపార్టీతోసహా అనేక పార్టీలచే సంయుక్తంగా ఏర్పాటుచేయబడిన "టిబెట్టు సహాయక ప్రజా కమిటీ" టిబెట్టు సమస్యను మిత్రరాజ్య సమితిముందుకు తీసుకురావాలని బహిరంగంగా కోరటమూ, చైనాప్రభుత్వము "బందిపోటు దొంగతనాన్ని, సామ్రాజ్యవాదాన్ని అనుసరిస్తున్నది" అని తిట్టుతూనూ, చైనాదేశపు అధినేతను "భయంకరుడైన మంచుమనిషి" అని అవమానపర్చుతూనూ, పూర్తిగా చైనా అంతరంగిక వ్యవహారమే అయిన టిబెట్టు సమస్యను పరిష్కరిస్తానికిగాను, సిమ్లా సమావేశంలాంటిదే ఒక త్రైపాక్షిక సమావేశాన్ని చైనా, ఇండియా, టిబెట్టులతో కలిపిఏర్పాటుచేయాలనీ భారతదేశపు పత్రికలు బహిరంగంగా వ్రాయటమూ జరుగుతోంది. టిబెట్టులో తిరుగుబాటు ప్రారంభమైనతర్వాతా, ప్రారంభంకాకముందు నుంచికూడా భారతదేశంలోని కొన్ని పత్రికలూ, కొందరు రాజకీయనాయకులూ క్యూబాలో విప్లవ ప్రతీఘాత ద్రోహులను పురితీసినప్పుడు అమెరికాలోని రాజకీయ,

ముతాలూ, పత్రికలూ ఏవిధంగా జోక్యం కల్గజేసుకొన్నాయో వాటిని తలపించే టట్లుగా చైనాకు వ్యతిరేకంగా నీచ ప్రచారానికి పూనుకున్నాయి. ఒక మిత్ర దేశంయొక్క ఆంతరంగిక వ్యవహారాలలో వేలుపెట్టి రాజకీయపు ఒత్తిడిని తీసుకు రావడం పంచసూత్రాలకు అనుగుణంగానే వున్నదని భావించారా అని మేము ప్రశ్నిస్తున్నాము.

టిబెటు సమస్యపై ఇండియా రియాక్షన్లు ప్రధానంగా రాజకీయంకావు అనీ, ఎక్కువగా భావోద్రేకం, మానవతా కారణాలవల్లనే ఏర్పడినవనీ, టిబెట్టు ప్రజలతో చిరకాలంగా ఏర్పడ్డ మత సాంస్కృతిక సంబంధాలద్వారా ఏర్పడిన బంధుత్వ భావాలుకూడా ఇందుకు కారణమనీ శ్రీ నెహ్రూ చెప్పుచున్నారు. చైనాలోని టిబెట్టు ప్రజలయెడ్తల భారతీయులకంటే బంధుత్వభావాలను మేము అర్ధంచేసుకో గలము. ప్రధాని చౌ ఎన్-లై భారతదేశం వెళ్ళినప్పుడు "భారతీయులూ, చైనీ యులూ అన్నదమ్ములు" అనే నినాదం దిక్కులు పిక్కటిల్లేట్లుగా ఎల్లడలా విన వచ్చింది. ఈ దృశ్యాలూ, అనుభూతీ నిన్ననే జరిగినవా అన్నట్లున్నవి. కాని టిబెట్టు ప్రజలయెడవున్న సద్భావాలు చైనాప్రజలయెడవుండే సద్భావాలను చెడ గొట్టటానికీ, చైనాయొక్క ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్గించుకొంటా నికీ ఒక సాకుగా ఎట్లా వుపయోగపడుతాయి? ఇటువంటి తర్కం చాలాప్రమాద కరమైనది. ఎందువల్లనంటే, ఇదేతర్కాన్ని అనుసరిస్తే, టిబెట్టులో ప్రజా తంత్రమూ, సోషలిజమూ నెలకొన్న తర్వాత, శక్తిసంపదలను చేకూర్చుకొన్న తర్వాత చిరకాలపు మత సాంస్కృతిక సంబంధాల సాకుతో ఇండియాలోని భాగాలైన అస్సాం ఆంతరంగిక వ్యవహారాలలోగాని, యు. పి. ఆంతరంగిక వ్యవహారాలలోగాని జోక్యం జేసుకొంటానికిగాను "అస్సామును బలపర్చటానికి ప్రజాకమిటీ" అనే పేరుతోనో, "యు. పి. వ్యవహారాలకొరకై కమిటీ" అనే పేరుతోనో కమిటీల నేర్పర్చవచ్చునుగదా? టిబెట్టు ప్రజలయెడవుండే గాఢ సానుభూతి, చిరకాల సంబంధాల పేరుతో కొన్ని హామీలను చైనాప్రభుత్వంనుండి ఇండియా ప్రభుత్వం కోరితే, మొత్తం చైనాప్రజలయెడ వుండే గాఢసానుభూతీ పురాతనపు సంబంధాల కారణాలవల్లనే, చైనా మొత్తం ఆంతరంగిక వ్యవహా రాలలో కొన్ని హామీలు యివ్వమని చైనా ప్రభుత్వాన్ని ఖచ్చితంగా అడగగలదు కాదా? అదేవిధంగా భారతీలయితో వుండే పురాతనపు సంబంధాలూ, వారియెడ వుండే గాఢసానుభూతికారణాలను చూపెట్టి ఇండియా ఆంతరంగిక వ్యవహా రాలలో చైనా ప్రభుత్వంకూడా కొన్ని హామీలను కోరవచ్చునుగదా? ఇది జరిగితే ఇక శాంతియుత సహజీవనం ఎక్కడ? పంచసూత్రాలు ఎక్కడ? పరస్పర వ్యవహారాలలో జోక్యం కల్గజేసుకోవటం అనే రొంపిలో ప్రపంచం దిగబడదా? అంతర్జాతీయంగా అటువంటి పరిస్థితులు ఏర్పడరాదని, సహించరాదనీ మేము

ఎంతగా కోరుతూవున్నామో అంతగట్టిగానూ మా భారతీయమిత్రులుకూడా కోరుతూ వున్నారని భావిస్తాము.

చైనా, టిబెట్టు వ్యవహారాలలో ఇండియా జోక్యం కల్గజేసుకొన్న యీ రెండు సందర్భాలనూ చూస్తే ఇండియా ప్రభుత్వానికి టిబెట్టును ఆక్రమించుకోవా లనే కోర్కె వున్నట్లుగాని, లేదా టిబెట్టును పేరుకు స్వతంత్ర దేశంగా నిలబెట్టాలని కోర్కె వున్నట్లుగాని కన్పించదు. కాని చైనా మాత్రం తన భూభాగమే అయిన టిబెట్టుపై తన పూర్తి సార్వభౌమత్వాన్ని చలాయించ వీలులేకుండా నిజంగా అడ్డుపడ ప్రయత్నిస్తున్నదని తేలికగానే అర్థం అవుతుంది. ఈ విషయంలో మాత్రం భారతదేశంలోని కొంతమంది రాజకీయ నాయకులు గతంలో బ్రిటిషు ప్రభుత్వం అనుసరించిన సాంప్రదాయాలనే అనుసరిస్తున్నారు. ఇండియాకు భూటాన్, సిక్కిములపై "ఏలుబడి అధికారాలు" వున్నట్లే చైనాకు కూడా టిబెట్టుపై "ఏలుబడి అధికారాలు" మాత్రమే వున్నట్లు వీరు గుర్తించ జూస్తారు. టిబెట్టుకు "స్వపరిపాలన" కావాలని వీరు కోరుతున్నది చైనా రాజ్యాంగచట్టంలో స్పష్టంగా నిర్దేశింపబడ్డ జాతీయ ప్రాంతీయ స్వపరిపాలన వంటిది కాదు; లోపలి మంగోలియా, సింకియాంగ్, క్వాంగ్సీ, నింగ్ షైలలో అమలుజరుపబడే జాతీయ ప్రాంతీయ స్వపరిపాలన వంటిది కాదు; వారు కోరే స్వపరిపాలన దాదాపు అర్థ స్వాతంత్ర్య ప్రతిపత్తి. టిబెట్టు చైనాలోని ఒక రాష్ట్రం కాదన్నమాట వాస్తవమే; రాజ్యాంగచట్టంలోనూ, చట్టరీత్యానూ ఒక రాష్ట్రానికి యివ్వబడ్డవాటికంటె ఎక్కువ అధికారాలూ, విధులూ కల్గినట్టి స్వపరిపాలిత రాష్ట్రం;

కాని ఒక్కటి మాత్రం స్పష్టం. అది ఒక రక్షితదేశం మాత్రం కాదు. అది చైనాకు రక్షితదేశమూ కాదు, ఇండియా క్రింద వుండే రక్షిత రాజ్యమూ కాదు, చైనా-ఇండియాల మధ్య వుండే మధ్యస్తదేశమూ కాదు. లోపలి మంగోలియా, సింకియాంగ్, క్వాంగ్సీ, నింగ్ షైలపై చైనా ప్రజా రిపబ్లిక్కు ఎటువంటి పూర్తి సార్వభౌమాధికారములు వున్నవో అటువంటి అధికా రాలే టిబెట్టుపై కూడా వున్నాయి; ఈ విషయంలో ఎట్టి సందేహానికీ తావులేదు. ఏ సాకుతోనైనాగాని, ఏ రూపంలోనైనాగాని ఏ విదేశమైనా, లేక మిత్రరాజ్య సమితి యైనా ఈ విషయంలో జోక్యం కలగజేసుకుంటే సహించేదిలేదు. కాబట్టి టిబెట్టు విషయమై ఏ సమస్యయైనా వుంటే అది చైనావల్లనే, చైనాతోనే పరిష్కరింప బడాలి, కాని ఏ యితర దేశాలతోనూ మాత్రం కాదు, టిబెట్టుకు అర్థ స్వాతంత్ర్య ప్రతిపత్తి అంటే అది టిబెట్టు ప్రజలకూ, చైనా ప్రజలకూ, భారతీయులకూ, చైనా ఇండియా మైత్రికీ, ఆశియాలో శాంతికీ కూడా మంచిదికాదు. అటువంటి ప్రతిపత్తి అనేది టిబెట్టుకు చెందిన దేశద్రోహులైన అభివృద్ధి నిరోధక పెద్ద దాస యజమా నుల ప్రయోజనాలకూ, వారిని బలపర్చే విదేశీ దురాక్రమణదారుల ప్రయోజనా

లకూ, చైనా, ఇండియాల మధ్య విరోధాన్ని పెంచగోరే సామ్రాజ్య విస్తరణ కాంక్షుల యొక్క, కుట్రదారులయొక్క ప్రయోజనాలకూ మాత్రమే వుపయోగ పడుతుంది. చైనా ఇండియాలు రెండూ శాంతికాముక దేశాలు. వీటి మధ్య మైత్రి చిరకాలంగా వున్నది. ఈ రెండు దేశాలూ సఖ్యతతో సహజీవనం గడప టము ఎక్కువ అవసరం. ఒకరిపై మరొకరు దురాక్రమణ జరపటానికిగాని, ఒకరి వ్యవహారాలలో మరొకరు జోక్యం కల్పించుకొనటానికి గాని, లేదా పరస్పరం కలహించుకొనటానికిగాని, ఇర్వురిమధ్య ఒక మధ్యస్త ప్రాంతాన్ని ఏర్పర్చుకొన టానికి ఎట్టి కారణమూ కన్పడదు. అటువంటి మధ్యస్త ప్రాంతాన్ని ఏర్పర్చమని బలవంతం చేయటంవల్ల ఏ సంఘర్షణా లేనటువంటి సందర్భంలో సంఘర్షణను ఏరి కోరి తెచ్చుకోవటమన్నమాట. ఇది చాల విచారించదగ్గ విషయం. ఈ సమ స్యపై భారతదేశ ప్రభుత్వం అవలంబించే వైఖరివల్లా, బాధ్యత లేనివారని చెప్ప వీలుకాని కొంతమంది భారతీయ రాజకీయవేత్తలు చేసిన ప్రకటనలవల్లా, ఇండియా చైనాల మధ్య మైత్రిని దృఢతరం చేయటానికి అతి ముఖ్యం అనే వుద్దేశంతో మేమీ విషయాన్ని అతిస్పష్టంగా చెప్పవలసివస్తున్నది. ఏప్రిల్ 27 న చేసిన ప్రకటనలో ప్రధాని నెహ్రూ పంచసూత్రాలను ప్రస్తావిస్తూ, కేవలం "పరస్పర గౌరవాన్ని" మాత్రమే పేర్కొన్నారు. నిస్సందేహంగా ఇది చాల అవు సరమే; కాని "ఉభయదేశాల ప్రాదేశిక భద్రతయెడ, సార్వభౌమత్వం యెడా పర స్పర గౌరవం" అని చెప్పలేదు. (ఈ మాటలు పంచసూత్రాలనుండి యధాతధంగా ఉల్లేఖించబడ్డవే. ఏ పరస్పర గౌరవాలకైనా ఇదే మూలకందంగా వుండగలదు.) ఇది కేవలం భ్రమప్రమాదజనితమే అని మేము అనుకొంటాము.

చైనా ఆంతరంగిక విషయాలలో కొందరు భారతీయ రాజకీయవేత్తలు జోక్యం కల్గించుకొనడం యాదృచ్ఛికమేమీ కాదు. అది ప్రస్తుత కాల ప్రభావ చిహ్నమే. బ్రిటిషు సామ్రాజ్యవాదుల వలన పరిపాలననుండి విడివడి భారతదేశం స్వతంత్రాన్ని పొందింది. శాంతియుత అంతర్జాతీయ వాతావరణంలో తన జాతీయార్థికాభివృద్ధిని సాధించాలని చూస్తున్నది; అందువిషయంలో సామ్రాజ్యవాద శక్తులతో దానికి గాఢమైన వైరుధ్యాలు వున్నాయి. ఇది ఒకపెడ. మరొకపెడ చూస్తే భారతదేశంలోని బడా బూర్జువావర్గానికి సామ్రాజ్యవాదంతో అనేక సంబం ధాలు వున్నాయి; కొంతవరకూ విదేశ పెట్టుబడిమీద ఆధారపడుతున్నది. అంతే కాదు; తన సహజ వర్గ స్వభావంతో, కొంత విస్తరణకాంక్షను కూడా కల్గివున్నది. అందువల్లనే పరాయిదేశాలలో జోక్యం కల్పించుకొనే సామ్రాజ్యవాదుల పంథాను అది ఎదిరించుతూనే, అదే సమయంలో బుద్ధిపూర్వకంగానో, కాకుండానో, కొద్దో గొప్పో జోక్యం కల్గించుకొనే యీ సామ్రాజ్యవాద పంథా ప్రభావాలను కన్పరుస్తూవుంటుంది. నెహ్రూ నాయకత్వం క్రింద భారతదేశ ప్రభుత్వం అంత

ర్జాతీయ వ్యవహారాలలో సర్వసాధారణంగా భారతదేశ ప్రజల అభీష్టాలను ప్రతి ఫలిస్తున్నది; యుద్ధాన్ని, వలసరాజ్యాంగ నీతినీ ఎదిరించటంలోనూ శాంతిని కాపాడటంలోనూ, చైనా, సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాలతో మైత్రిని పెంపొందించేటటువంటీ, అమెరికన్ సామ్రాజ్యవాదపు సైనిక కూటము లలో జేరకుండా వుండేటటువంటి విదేశాంగ నీతిని అవలంబించటంలోనూ ముఖ్యమైనటువంటీ, శ్లాఘనీయమైనటువంటీ పాత్రను వహిస్తున్నది. కాని చారిత్రక కారణాలవల్ల భారతదేశపు బడా బూర్జువావర్గం బ్రిటిషు వలస రాజ్యాధిపతుల వారసత్వ లక్షణాలను కొన్నిటిని పొంది, వాటిని కొనసాగించ జూస్తున్నది. భారతదేశ బూర్జువావర్గంయొక్క యీ ద్వంద్వస్వభావానికి ఘన చరిత్రగల భారతీయ ప్రజలు ఎంతమాత్రమూ బాధ్యులుకారు. భారతీయ ప్రజలేగాక, భారత దేశ ప్రభుత్వంలో దీర్ఘదృష్టి. వివేచనా గల సభ్యులుకూడా అభ్యుదయంలోనే, వెనకచూపు చూడటంగాక ముందుకు చూడటంలోనే భారతదేశ భవిష్యత్తు వుందని గుర్తించినట్లుగా కూడా మేము యెరుగుదుము. వారిలాగానే మేముకూడా, యిటీవలనే స్వాతంత్ర్యాన్ని పొంది, యింకా సామ్రాజ్యవాదుల బెదరింపులకు గురి అవుతూవుండే దేశంయొక్క అధినేతలు తన పొరుగుదేశ వ్యవహారాలలో జోక్యం చేసుకోవటమనేది ప్రస్తుత అంతర్జాతీయ రాజకీయాలలో విషాదకరమైన పోకడగా గుర్తిస్తున్నాము,

మేమూ, శ్రీ నెహ్రూ ఒక విషయంమీదనో, మరొక విషయంమీదనో భేదించవచ్చు. కాని భారతదేశంయొక్క ఆంతరంగిక వ్యవహారాలలో చైనా జోక్యం కల్గించుకోలేదన్న విషయంపై ఎట్టి అభిప్రాయభేదమూ వుండజాలదు. ఇండియాలో యెంతో పెద్దయెత్తున నిందాప్రచారం ముమ్మరంగా సాగినమీదటనే చైనా ప్రజలు ఎదురుకొట్ట ప్రారంభించారు. చైనా, ఇండియాల మధ్యవున్న స్నేహ సంబంధాలకు వ్యాఘాతం కల్పించే వుద్దేశ్యంతో కొంతమంది భారతీయులు చేసిన ప్రకటనలనూ తీసుకొన్న చర్యలనూ శ్రీ నెహ్రూ తన ఏప్రిల్ 27 వ తేదీ ప్రకటనలో విమర్శించారు: ఇది చాలా సరైనది. కాని దురదృష్టవశాత్తు, దీని వెనువెంటనే చైనా వ్యవహారాలలో జోక్యం కల్గించుకొనటం అన్న మా విమర్శపై ముమ్మరమైన దాడిని ప్రారంభించారు. "చైనాలోని బాధ్యతగల వ్యక్తులు ఇండియాపై చేసిన వ్యాఖ్యలూ ఆరోపణలూ" "సత్యానికీ, మర్యాదకూ నిమిత్తం లేకుండా వున్నాయి" అనీ. "ప్రచ్ఛన్నయుద్ధం భాషను వాడటం జరిగింది" అనీ అన్నారు. కాని మేము లోగడనే చెప్పినట్లుగా, ఇండియా జోక్యంకల్గచేసుకొంటున్న దన్న చైనా ఆరోపణకు గట్టి ఆధారాలున్నవి. దలైలామా చేశారని చెప్పబడే ప్రకటన వీరు వ్రాసినది కాదు అని చైనా ప్రజలు వెల్లడించిన సందేహాలు కూడా వాస్తవ విషయాలపై ఆధారపడి వున్నవి. ఆ ప్రకటనలో విస్తారంగా వున్నలోట్లూ,

ఫోర్జరీచేసిన గుర్తులూ యింకా యథార్థంగానే వున్నాయి. దలైలామాను ఇండియాకు లేవదీసుకుపోయిన టిబెట్టు అభివృద్ధి నిరోధకులూ, చాలాకాలంగా కాలింపాంగ్‌లో కూర్చొని విద్రోహ కార్యక్రమాలను సాగిస్తూవున్న టిబెట్టు అభివృద్ధి నిరోధకులూ కలిసి దలైలామా తిరిగి తన మాతృదేశానికి వస్తానికి వీలులేకుండా మార్గావరోధం కల్పిస్తానికిగాను ఆ ప్రకటన అనబడేదానిని వుపయోగించుకొంటానికై సర్వశక్తులూ ధారపోస్తున్నారనటంలో సందేహంలేదు. ఇది నెహ్రూ పదేపదే వెల్లడించిన భావాలతో ఎక్కడా అతకటంలేదు.

ఇక సత్యం – మర్యాదలకు గల ప్రాధాన్యత చూస్తే గత నెల అంతకు మించిన రోజులలో, ఇండియాలోని కొంతమంది రాజకీయవేత్తలు చెప్పినవీ, కొన్ని పత్రికలు వ్రాసినవీ చూస్తే వారు సత్యమూ, మర్యాదలకు కించిత్తు అయినా అవకాశం యిచ్చినట్లు కన్పడలేదని చెప్పటానికి మేము విచారిస్తున్నాము. ఈ విషయంలో వీటిని అదుపులో పెట్టటానికి కొన్ని పర్యాయాలు శ్రీ నెహ్రూ ప్రయత్నించిన విషయాన్ని మా చైనా ప్రజలు గుర్తించారు. చైనా. ఇండియాల మైత్రికి ఇది నిస్సందేహంగా లాభదాయకం. కాని. 17 షరతుల ఒప్పందాన్ని చైనా కేంద్ర ప్రజా ప్రభుత్వం ఉల్లంఘించినదనీ, ఇండియాకు చైనా "హామీలు" అనబడేవాటిని యిచ్చిందనీ, ఈ విధంగా వారు నిందిస్తున్నప్పుడు. వారి రిమార్కుల సత్యాన్నీ, మర్యాదనూ పాటిస్తున్నవనీ మేము భావించలేము. ప్రచ్ఛన్న యుద్ధ భాషను వాడుతూ, భారతదేశపు కొన్ని ప్రచురణలూ, కొందరు రాజకీయ నాయకులూ "సామ్రాజ్యవాదంయొక్క కొత్త రూపం, భయంకర రూపం, అనీ" "విస్తరణ కాంక్ష గల సామ్రాజ్యవాదం" అనీ చైనాపై దుమ్మెత్తి పోయటమూ, టిబెట్టులో తిరుగుబాటును చైనా అణచివేయటాన్ని "సైనిక దురాక్రమణ" అనీ, "వలస దేశాంగ నీతి" అనీ, "బందిపోటు దొంగతనం" అనీ ఖండించటమూ చేశారు. సరిగ్గా ఈ భాషే "ప్రచ్ఛన్న యుద్ధ భాష" కాదా? ఇటువంటి "ప్రచ్ఛన్న యుద్ధ భాష" యెడ మేము చాలాకాలం ఓర్మి వహించియున్నాము. మా పత్రికలు దాదాపు నిశ్శబ్దంగా వూరుకున్నాయి. ఏప్రిల్ 18 వ తేదీన కూడా, ద్వితీయ జాతీయ ప్రజా కాంగ్రెసులో మాట్లాడుతూ ప్రధాని చౌ యెన్ లై, చైనా భారత దేశాల మైత్రి నిలబెట్టాలంటూ మనస్ఫూర్తిగా విజ్ఞప్తి గావించారు. కాని విచారకరమైన విషయమేమిటంటే, దీనికి వచ్చిన జవాబు, దలైలామా చేశాడనబడే ప్రకటనాధారం చేసుకొని పెద్ద రభస సాగించటమూ, ఇంతకు మించి మా ప్రభుత్వంపైనా, ప్రజలపైనా కళ్ళెం వదలి దాడి సాగించటమూ మాత్రమే. వెనక్కు తగ్గటం ఇక అసాధ్యమైన తరుణంలోనే మేమూ లేచి, ఎదురుకొట్ట ప్రారంభించాము. చైనాను గూర్చి ఇండియా సాగించిన నిందాపూర్వక భాష ప్రచారాన్ని సమర్థించుటకై "వాక్స్వాతంత్ర్యం వుండనక్కరలేదా" అని కొందరు

రంటారు. కాని చైనా ప్రజలకు మాత్రం వాక్స్వాతంత్ర్యం వుండనక్కరలేదు అని వారు ఒక్క నిముషమైనా ఎందుకు ఆలోచించరు? టిబెట్టు మా భూభాగం. టిబెట్టు సమస్య మా అంతరంగిక సమస్య. ఈ సమస్యపై విదేశీయులు కూడా అనుకోకుండానే ఉద్రేకపడుతున్నారని అంటే మా దేశ ప్రజలు మాత్రం అనుకోకుండానే ఉద్రేకం పొందకుండా వుండగలరా? ప్రస్తుతం కొన్ని విదేశాలలో మాపై సాగే నీచ ప్రచారం కొంత తగ్గుముఖం పట్టినట్లున్నది. హేతువాదం తల యెత్తుతోంది. అయినప్పటికీ మంటలను ప్రజ్వరిల్లజేస్తానికి చాలా స్వల్ప సంఖ్యలో వున్న కొంతమంది ప్రయత్నిస్తూనే వున్నారు. "మీరు చైనా వ్యతిరేక నీచ ప్రచారాన్ని మాననంతవరకూ మేము ఎదురుదెబ్బలు కొడుతూనేవుంటాము" అని మేము వారికి స్పష్టంగా తెలియజేస్తున్నాము. మీరెంత కోరితే అంత కాలాన్నీ ఇందుకు మేము వుపయోగించగలం. మాపై దాడికి మీరు ఇతర దేశాలు దాడి చేసేటట్లుగా రెచ్చగొట్టితే. వారి నెదుర్కొంటానికి కూడా మేము సిద్ధంగానే వున్నాము. ప్రపంచంలోని సామ్రాజ్యవాదులందరూ మిమ్మల్ని ఈ అల్లరిలో బలపర్చటాన్నికూడా మేము గమనించాం. దాని నెదుర్కొనటానికి కూడా సిద్ధంగా వున్నాము. కాని చైనా అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్గజేసుకొనే ప్రయత్నాలుగాని, ఏ ఒత్తిడి మూలకంగానైనా సరే టిబెట్టులో దాస యజమానుల దుష్ట పరిపాలనను రక్షించటానికి చేసే ప్రయత్నాలుగాని పూర్తిగా వృథా. ప్రపంచంలోని అన్ని కమ్యూనిస్టు వ్యతిరేక శక్తులూ, చైనా వ్యతిరేక శక్తులూ కలిసి ఎంత ఎక్కువ తీవ్రంగా మమ్మలను తిట్టటానికి పూనుకుంటే అంత ఎక్కువగా వారి నిజ స్వభావాలతో బయటపడతారు; మొత్తం ప్రపంచ ప్రజలందరికీ అంత మంచి పాఠాన్ని నేర్పినవారౌతారు.

మేము లోగడనే చెప్పినట్లుగా, ప్రపంచంలో చాలామంది ప్రజలు వివిధ విభిన్న దృక్పథాలనుండి నేడు టిబెట్టు సమస్యను చర్చిస్తున్నారు. చైనాకు కీడును కోరేవారు చాలామంది వీరిలో వున్నారు. కాని ప్రధాని నెహ్రూ మాత్రం అటువంటివారు కారు. టిబెట్టు సమస్యపై వారు మాతో కొంత విభేదిస్తున్న మాట వాస్తవమే. అయినా, వారు సర్వసాధారణంగా చైనా, భారతదేశాల మైత్రిని కాంక్షించే వ్యక్తి. మాకీ విషయంలో ఎట్టి సందేహం లేదు. మేమూ ప్రధాని నెహ్రూ విమర్శనల కింత వివరమైన జవాబు యిస్తున్నామంటే (మాకు కీడును కోరేవారిని కూడా యీ వ్యాసంద్వారా ఘాటుగా విమర్శించక పోలేదు) అందుకు కారణం విభేదాలను తగ్గించవచ్చుననీ, వివాదాల్ని పరిష్కరించవచ్చుననే గట్టి ఆశ వుండటమే. మా మాతృదేశంయొక్క, టిబెట్టు ప్రజలయొక్క ముఖ్య ప్రయోజనాలకు సంబంధించినవి కాబట్టి యీ చర్చ కొంత ఘాటుగా వుండవచ్చు. అయినప్పటికీ మా వాదనయొక్క సారాంశం, మన ఉభయ ప్రజల

మధ్యా పరస్పర అవగాహనకూ, మన ఉభయదేశాల ప్రజల మధ్యా, ఉభయ ప్రభుత్వాల మధ్యా స్నేహానికీ తోడ్పడుతుందని మా గట్టి విశ్వాసం. మేము వాడిన భాషకూడా స్నేహాన్నీ, మర్యాదనూ అతిక్రమించి పోలేదనుకొంటాము. చైనా ప్రజల నుద్దేశించి ప్రధాని నెహ్రూ మనస్ఫూర్తిగానూ, గట్టిగానూ చెప్పిన హితవాక్యాలతో మేము పూర్తిగా ఏకీభవిస్తున్నాము: "ఇండియా - చైనాల మధ్య మైత్రిని నిలబెట్టాలని మేము గాఢంగా కోరుతూవున్నాము" అనీ, "తరతరాలుగా శాంతియుతంగా జీవిస్తున్న యిరుగుపొరుగు దేశాలైన రెండు గొప్ప ఆసియా దేశాలు గనుక ఒకరిపై ఒకరు శత్రుభావాలు పెంచుకుంటే అదొక గొప్ప విషాద ఘటనయే కాగలదు:" అనీ వా రన్నారు. చైనా భారతదేశాల మైత్రి పురాతన మైనది; గట్టి పునాదులపై నిల్చివున్నది, మన ప్రప్రధాన ప్రయోజనాలు ఒకటే; మన ప్రధాన శత్రువుకూడా ఒకటే. మన వుభయులకు సమానంగావున్న ప్రయోజ నాలను మర్చిపోయి, మన కిద్దరకూ సమానమైన శత్రువు పన్నే వలలో పడటం ఎన్నడూ జరగకూడదు. అసలీ వివాదం ప్రారంభం కావటానికే మేము విచా రిస్తూ వున్నాము. అయినా యిందువల్ల విరోధభావాలు ఏర్పడవనీ, మన ఉభయ దేశాల మైత్రిని చెడగొట్టవనీ మేము గాఢంగా నమ్ముతున్నాము. టిబెట్టులో జోక్యం కల్గజేసుకొనే ఉద్దేశం ఇండియాకు ఎన్నడూ లేదని ప్రధాని నెహ్రూ ప్రక టించారు. ఈ స్నేహ ప్రకటనను మేము ఎంతో ఆనందంతో ఆహ్వానిస్తున్నాము. టిబెట్టులో జోక్యం కల్గజేసుకోవాలనే మాటలూ, చేతలూ ఇండియా వైపునుండి ఆగిపోగానే యీ ప్రస్తుత వివాదం ముగిసిపోతుంది. ఇండియాలో చైనా ఎన్నడూ జోక్యం కల్గించుకోలేదు; ఇకముందు కూడా యెన్నడూ జోక్యం కల్గించుకోదు. భారతదేశపు భద్రతనుగూర్చి ఆందోళనపడే భారతీయ దేశభక్తు లందరికీ మేము గట్టి హామీ నిచ్చే దేమిటంటే, చైనాలోని వివిధ జాతుల పెద్ద కుటుంబంలో సంపన్న ప్రజాతంత్రయుతమైన టిబెట్టు స్వపరిపాలిత ప్రాంతం ఒక భాగస్వామిగా వుండట మనేది చైనా. భారతదేశాల మధ్య మైత్రిని సుస్థిరం చేస్తానికీ, బలపర్చటానికీ దోహదకారి అవుతుంది. అంతేగాని, అది భారతదేశ రిపబ్లికుకు ఏలాంటి ప్రమాద కారీ" కాజాలదు; కాదు. హిమాలయ పర్వతా లే విధంగా అభేద్యమైనవో అదే విధంగా సోషలిస్టు - చైనా పొరుగు దేశాలతో స్నేహపూర్వకమైన సంబంధాలను సాగించే పంథా కూడా శాశ్వతంగా అభేద్యమైనట్టిది. మన ఉభయదేశాల 100 కోట్ల ప్రజల మైత్రి కూడా శాశ్వతంగా అభేద్యమైనట్టిది. 1954 అక్టోబరులో ప్రధాని నెహ్రూ చైనాకు వచ్చినప్పుడు: "అభ్యుదయం వైపుకు సాగిపో కృత నిశ్చయురాలైన ఇండియా, చైనా రెండు గొప్ప దేశాలూ ఒకేరకమైన సమస్య లను ఎదుర్కొంటున్నవి. ఈ ఉభయదేశాలూ ఒకరినొకరు ఎంత చక్కగా అర్థం చేసుకోవాలో అంతమేరకు ఆసియా ఖండముయొక్క శుభమూ, అంతేగాక,

మొత్తం ప్రపంచంయొక్క శుభమూ ఆధారపడి వుంటాయి. ఈ రోజున ప్రపంచంలో వున్న వుద్రిక్త పరిస్థితుల మూలకంగా మనం ఉభయులమూ శాంతికొరకై సమిష్టిగా కృషిచేయ వలసి వున్నది" అని చెప్పారు. ప్రధాని నెహ్రూ యిందులో వ్యక్తపర్చిన సత్యాన్ని మన ఉభయదేశాల ప్రజలూ యెల్లప్పుడూ గుర్తుంచుకోవాలన్నది మా అభిలాష. చైనా ప్రజలవలెనే ఉజ్వల చరిత్ర గల భారతదేశ ప్రజలుకూడా చైనా - భారత దేశాల మైత్రిని యెంతో విలువైనవిగా చూస్తున్నారు. వాస్తవ విషయాలు తెలియవచ్చినకొలదీ చైనా - భారతదేశాల మధ్య గల సత్సంబంధాలను విషపూరితం జేసే నీచారోపణల నిజస్వభావాన్ని భారతీయ ప్రజాసామాన్యం గుర్తిస్తుందనీ. నిరసిస్తుందనీ, ఉభయదేశాలలోని వ్యక్తులందరూ యిందుకు సమిష్టి ప్రయత్నాలను చేస్తారనీ మేము గట్టిగా విశ్వసిస్తున్నాము. శాంతిపూరిత నిర్మాణ కార్యక్రమంలో ఇండియా, చైనా దేశాలూ, ఈ రెండుదేశాల ప్రజలూ తమ స్నేహపూర్వక సహకారాన్ని కొనసాగించి తీరుతారు; ఆసియా ఖండంలోనూ, మొత్తం ప్రపంచంలోనూ శాంతిని కాపాడటానికై భుజం భుజం కలిపి పోరాటాన్ని సాగించితీరుతారు.